REG. No. 577

శ్రీ

# అభినవసరస్వతి



పత్రిక

అష్టావధాని. ... భిరామశాస్త్రిచే

బ్రచ ... చున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపుటము 7 { 1915 జనవరి, ఫిబ్రవరి. } సంచిక 1-2

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 ... చందాదారులకు 2 0 0

చంద్రికా ... ...లు, గుంటూరు.

... Press, Guntur

...e Editor Ashtavadhani

...na Sastry.

# ప్రధాన పోషకులు

1 శ్రీ శ్రీ జగద్గురు ~~[illegible]~~ స్వాములవారు.
2 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.
2 శ్రీ రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహదరు
కుమార జమీందారుగారు గంపలగూడెం

## పోషకులు.

1 శ్రీ రాజా నారయప్పారావు సింహాద్ర్యప్పారావు బహదరు
జమీందారులు, నూజవీడు.
2 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి
3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానము మానేజరు నెల్లుట్ల
4 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టువకీలు [illegible]గారు
5 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చొల్లేరు
6 బీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి
1 అనంతరెడ్డి దేశముఖుగారు- పోతారెడ్డిపేట
2 వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదు బహదురు మన్నెసుల్తానుజమీందా
ముక్త్యాల

## సహాయులు,

1 బీరకాయల రామారావు దేశముఖుగారు- రాయగిరి
2 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి
3 నరసింహాచార్యులుగారు- పట్వారీ- కొలనుపల్లి
4 హనుమంత రెడ్డిగారు- క్షీరసాగరం
5 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు- మిడికొడ్డి
1 అన్నమురాజు సుబ్బారావుగారు నందూరు.
2 నందూరు నరసింహారావుగారు, కరణం, నందూరు.
3 నైషధము సీతాకాంతముగారు మోరంపూడి.
4 మెదను శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి
5 బాకరాజు దేశముఖుగార, యాదవరము.
6 కుప్పా శంకరశాస్త్రిగారు, చివలూరు.
7 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిల్ల.
8 నారసింహారెడ్డి దేశాయిగారు, కాసరబాద.
9 పిరాట్ల సీతాకాంతముగారు, చింతపల్లి.
10 కానుమూరు హనుమయ్యగారు, నర్సారావుపేట.
11 తంగెడ నరసింహారావుగారు, కర్ణం

# కృతివిమర్శము

స్నేహలత — ఇది యొక్క చిన్న ద్విపదకావ్యము. ఇందలినీతి వరశుల్కము కూడదని-తనవివాహమునకై వరుఁడుకోరినశుల్కమునకుఁ దలతాకట్టుఁబెట్టఁజూచు తండ్రి మీఁదివాత్సల్యమునఁ దనదేహమును ధనంజయునకర్పించిన యొక కలశీలసౌందర్యవిద్యా వినయవివేకవతిచరిత్ర మందువర్ణితము. కవిత్వ మతిపేశలము. గ్రంథకర్త పుయ్యూరి యెస్టేటుజమీందారులగు రాజా వెంకటాద్రిఅప్పారావుబహదరు గారు. వీరివయస్సు 18వత్సరములు. నూజవీటిసంస్థానచరిత్రముకూడఁ బ్రాయుచుండిన భాషాభిమాని. యిట్టిప్రభువులయభిమానమునకే పాత్రమగు మనయాంధ్రభాషావధూటి మరలఁ గృష్ణదేవరాయల కాలమునాఁటి యౌన్నత్యముఁ వహించుగాక.

శ్రీ

## యాదగిరి తిరునాళ్ళ.

నైజాము రాష్ట్రములోని నల్లకొండప్రాంతములో భువనగిరియను రైల్ స్టేషన్ గ్రామమునకుఁ దాపున యాదగిరి యనుకొండ యనాదిపుణ్యక్షేత్రముగా శ్రీనృసింహస్వామివారి స్వయంవ్యక్తస్థలమై యున్నది. ఆసమీపగ్రామములవారేకాక దూరదేశములప్రజలుసైత మచ్చటికివచ్చి యాపన్నివారకుఁడగు శ్రియఃపతిని నెలలతరబడి సేవించుచు గష్టములనుండి యుత్తీర్ణులగుచుండుటకలదు.

ఇమ్మహోత్సవములఁ బది పదిరెండుసంవత్సరములనుండి సమీపగ్రామవాస్తవ్యులును నిర్వ్యాజభక్తిధురీణులును విద్వద్విధేయులును సహజానందకందిలహృదయులును నగుపరాంకుశం శేషాచార్యులవారు శ్రీయాదగిరినరసింహస్వామివారికి భక్తులును అర్చకులును ధర్మకర్తలును నై యచ్చటికైంకర్యముల దినదినప్రవర్ధమానములుగఁ జేయుచు స్వామివారివైభవమును వస్తువాహనప్రముఖసామగ్రితో ననంతముగఁ గూర్చుచు యచ్చటికరుదెంచిసేవించువిప్రులకు వాససౌకర్యాదులొనఁగూర్చుచుఁ దత్స్థలమహిమ లోకజీవనముగ నేర్పడియుండిరి.

వీరిచ్చటకెల్లనధికారులైనదాదిగఁ గొన్నియేండ్లనుండి మార్గశీర్ష శుద్ధపూర్ణిమకు శ్రీస్వామివారికల్యాణమహోత్సవము మహావైభవముగ జరుపఁబడుచున్నది. ఇయ్యుత్సవముభక్తులకు భక్తిరసముఁగొల్పుచు విరక్తులకు వైరాగ్య మభివృద్ధిఁజేయుచుఁ బండితుల కర్హసత్కారము లొనఁగూర్చుచు వేయేల? లాతియుత్సవకర్తల కొక క్రొత్త మార్గ ముత్సవవ్యయవిషయమై యుపదేశించుచు మహాజనరంజకంబై యుండెననుట స్వభావోక్తికాని వేఱొకటికాదు.

ఇంతటిప్రశంసనీయత కీయుత్సవానఁగల విశేషమేమి? వివిధవిద్యావంతు లర్హతానుసారముగ సన్మానింపఁబడుటయే! దేనిచేతఁబూర్వకాలమునఁ బరిషత్తులు సత్రయాగములు సదస్సులు మున్నగునవి యేర్పడి దేశమునకు మహోపకారముఁజేయుచువచ్చినవో, దేనిచేతఁ బ్రకృతకాలమున జీర్ణజీర్ణములగుచున్న భారతీయవిద్యాలతికలకు వర్షాగమప్రాప్తి యూహింపఁబడతగియున్నదో అట్టివిద్యాగోష్ఠిచే నలంకృతములగుచుండినఁగదా ఇప్పటికల్యాణోత్సవములుగాని యిప్పటిసప్తాహములుకాని యిప్పటి బ్రహ్మసత్రమహాసామ్రాజ్య పట్టాభిషేకాది మహావ్యయకార్యములుగాని ఫలవంతములనియు మహాజనప్రశంసనీయములనియుఁ జెప్పఁదగ్గవగును.

ప్రకృతమనుసరింతము, ఈయుత్సవములో వ్యయమంతయు విద్యాభివృద్ధికి సంబంధించినదే. పలువురు వేదవేత్తలు వార్షికములచే గౌరవింపఁబడుచున్నారు. ఘనపాఠులును శ్రౌతమందుఁబూర్ణులును పౌండరీకాంతక్రతుకర్తలును సంస్కృతాంధ్రములలోఁగవులును సంగీతాదులలోఁగూడఁ గొంతప్రవేశముకలవారును నైన దొంతిగ్రామవాసులు శ్రీవెంకటరాజులవారును దత్సదృశులగు మఱికొంద అధ్యాపకులును శ్రీస్వామివారికల్యాణోత్సవవైభవమున కలంకారముగనుండి స్వస్తివాచనధ్వనులచే శ్రోతల చెవులపండువుచేయుచుండుమహాభాగ్యము పండితసత్కారమను నీలక్షణము లేనిచో నీతిరువాళ్లకుమాత్ర మేలలభించెడిని? శాస్త్రివేత్తలును గవులును గాయకులును వైణికులును నొకయేబదిమందికెక్కువగ సన్మానింపఁబడిరి; బహుమతులు నైతము హీనము గాఁగాక పదులుమొదలుకొని నూఱువఱకునున్నవి. వార్షికములుగ నేర్పడినవికూడఁ బదిమొదలు ముప్పదివఱకర్హతానుసారముగనుండినవి. విద్యావతులగు వేశ్యాంగనలు నూటికెక్కువగ మంచిబహుమతులిచ్చి మన్నింపఁబడిరి. (సశేషము)

# యజ్ఞము.

శ్లో॥ శ్రుతిస్మృతిభ్యాం విహితం స్వర్గమోక్షఫలప్రదం
జగదుద్ధరణే హేతుం తం ధర్మం ప్రణమామ్యహం॥

ఆర్యులారా! "ధర్మేణ పాపమపనుదతి, తస్మాద్ధర్మం పరమం వదంతి, యజ్ఞదానతపఃకర్మ నత్యాజ్యం కార్యమేవతత్" ఇత్యాది శ్రుతిస్మృతికదంబము వలనఁ బాపక్షయ చిత్తశుద్ధి చిత్తైకాగ్ర్యద్వారమునఁ దత్త్వజ్ఞానలబ్ధమగు కైవల్యమును బొందఁ గోరెడివారలకు ధర్మమవశ్యాచరణీయమని తేటపడుచున్నది. అట్టి ధర్మములలో సప్తపాక యజ్ఞములును సప్తహవిర్యజ్ఞములును సప్త సోమసంస్థలును ప్రధానతమములును ద్విజుల కవశ్యకర్తవ్యములునై యున్నవి. వీనిలోని జ్యోతిష్టోమ మను సోమయాగము నెవని సైమూఁడుతరములవా రాచరింపరో వాఁడు దుర్బ్రాహ్మణుఁడు. దౌర్బ్రాహ్మణ్యము ప్రబల దోషావహము. దౌర్బ్రాహ్మణ్యనివృత్త్యైకై మఱియొక పశుయాగము నాచరింప వలయును గావున సోమయాగము (ప్రకృతము గుంటూరున జరిగిన యజ్ఞము) బ్రాహ్మణమాత్రుఁ డాచరింపక తీఱదని "యోదుర్బ్రాహ్మణస్సోమం నపిబేత్" ఇత్యాది వాక్యముల వలన విశదమగుచున్నది. ప్రతి మతస్థులును మహనీయులగు తత్తన్మత ప్రవర్తకులచే విధింపఁబడిన నియమములకు బద్ధులై యుండిరనుట పెక్కండ్రకుఁ దెలియని సంగతి కాదు. ఇటులుండ ననాదులనియు నీశ్వరునిచే సృష్ట్యాదిని బ్రహ్మాదుల కుపదేశింపఁ బడినవనియుఁ బురాతనులగు మహాత్ములచే నంగీకరింపఁబడినవియుఁ జరిత్ర విమర్శన శీలురగు నాధునిక విద్వాంసులచేఁ గూడ నన్ని దేశములలోని మతగ్రంథముల కంటే నతిపురాతనములనియు బహుసహస్ర వత్సరములకుఁ బూర్వమందే ప్రమాణ రాజములుగా నార్యులచే నంగీరింపఁబడిన వనియు వేనోళ్లఁ గొనియాడఁబడునవియు ధర్మబ్రహ్మాది సూక్ష్మతార్కిక మతానవగాహ్యపదార్థముల బోధించుచు లోకోపకార విషయమై తల్లివలె హితమును బోధించునవియు నైన శ్రుతులయందుఁ జెప్పబడిన ధర్మము మహామోహ నిమగ్నులమును స్వల్పబుద్ధులమును నగు మన మనంబులచే విచారించిచూచిన నధర్మముగను ననాచరణీయముగను జూపట్టినను శ్రేయస్సాధన విషయమై యాదరణీయతమము కాక మానదు. కొన్ని విద్యానియమములకు బద్ధుఁడై నియతకాలములం దుపాధ్యాయవశవర్తియై విద్యను గ్రహించుటయు రాత్రులందుఁ గొంతవఱకు నిద్రనుగూడఁ ద్యజించి వ్యాసంగము చేయుటయు బాలక్రీడాదులఁ ద్యజించుటయు

నవావశ్యకమనియు సౌఖ్యభంజకమనియు నిట్టిపని యవశ్యకర్తవ్యమని బోధించెడి తలిదండ్రులు తన నష్టమునకోరెడి శత్రువులనియుఁ బ్రతిమనుజునకును దలఁచుగా బాల్యమందుఁ దోఁపకమానదు. అయినను బరిణామదశయందిట్టి నియమముల ననుసరించిన వారలు పొందెడి లాభముల మనము కన్నులారఁ జూచుచున్నవారము. తలిదండ్రులు పుత్రున కీజన్మమందు మాత్రము లభింపఁదగిన మేలునే కనిపెట్టువారలు. శ్రుతియో సర్వజ్ఞకల్పమును నీశ్వరవచోరూపమును గావున మనుజునకు రాఁబోయెడి యనేక సహస్ర జన్మములందుఁగూడఁ బొందఁదగినట్టియు నిరవధికమగునట్టియు సౌఖ్యము నొనగూర్పఁ దగు సామర్థ్యము కలిగియున్నది. కావునఁ దమ బుద్ధిచే సామాన్యముగ విచారించినప్పుడు పశ్వాలంభనాదియుక్తమగు యజ్ఞము హింసాయుక్తమగుటంజేసి యధర్మమని పామరులకుఁ దోఁచినను సుసూక్ష్మమగు ధర్మరహస్యమును గురుతెఱింగిన శ్రుతిచేవిస్పష్టముగ బోధితమగుటంజేసి సర్వధర్మోత్తమమే యగుఁ గాకమానదు. కాముకులగు మనుజులదృష్టికిఁ బరదారగమనమాచరించినందునఁ దప్పేమియనియుఁ గామాగ్నిచే దగ్ధులగుటకంటె నిష్టమువచ్చిన స్త్రీని స్వపరస్త్రీవిభాగములేక పొందుటయే ధర్మమనియుఁ దోఁచినను నన్ని మతముల వారలచేఁగూడ నాయా మతగ్రంథముల యందుఁ జెప్పఁబడిన విధుల ననుసరించి పరస్త్రీగమనము చేయఁగూడ దనియుఁ గామాగ్నిచే నశించిన నశింపనిండనియుఁగదా తీరుమానము చేయఁబడియున్నది. నిరుపేదలకు శ్రీమంతులవద్దఁగల ధనమును విభజించి బీదసాదలను భేదములేనట్లు పంచిపెట్టులాగున నొకచట్టమును దొరతనమువారు నిర్మించిన బాగుగా నుండునని తోఁచినను నన్ని మతములవారును నెవ్వని న్యాయలబ్ధమగు ధనము వానికే యుండవలెనని తమ మతగ్రంథములలోని విధుల ననుసరించికదా వర్తించుచున్నవారలు? వేయేల నాస్తికులగు చార్వాకాదులుకూడఁ దమ మతాచార్యుల విధులనేయను వర్తించుచున్నవారలు-ఇప్పుడు క్రతువుల నాక్షేపించెడివారుకూడ నుచ్ఛృంఖలవృత్తినంగీకరించెడివారుకారు. ఇదియునుంగాక ॥శ్లో॥ ఓషధ్యఃపశవోవృక్షాస్తిర్యంచఃపక్షిణస్తథా। యజ్ఞార్థంనిధనంప్రాప్తాఃప్రాప్నువంత్యుత్సృతీః పునః॥ ఏష్వర్థేషుపశూన్ హింసన్ వేదతత్త్వార్థవిద్ద్విజః। ఆత్మానంచ పశూంశ్చైవగమయత్యుత్తమాంగతిం॥ అను మనువాక్యములును "నవాఉ వేతన్మ్రియసేనరిష్యసి, దేవాగ్ ఇదేషిపథిభిస్సుగేభిః, యత్రయంతి సుకృతోనాపి దుష్కృతః, తత్రత్వాదేవస్సవితాదధాతు" ఇత్యాది శ్రుతులును యాగమందాలంభనముచేయఁబడిన పశువునకు నికృష్టదేహత్యాగ పూర్వకముగా నుత్కృష్టశరీర ప్రాప్తికలుగునని బోధించుచున్నవి. మనుజునకు వ్రణాద్యుపద్రవములు సంభవించినపుడు శస్త్రవైద్యము తాత్కాలికదుఃఖ సంపాదకంబైనను జిరారోగ్యసంపా

దకమైనందున నందఱచే నంగీకరింపఁబడుచున్నది. అటులనే పశుశరీరముగల జీవునకు సంజ్ఞపనము తాత్కాలిక దుఃఖావహమైనను జిరతరసౌఖ్యసంధాయక మగుటం జేసి మహోపకారమేకాని యపకారము కానేరదు. యజ్ఞము స్వర్గఫలమునకే సాధనమనియుఁ దనకు స్వర్గముకలుగుటకై మఱియొక ప్రాణిని హింసించుట యధర్మమనియుఁ బామరులు శంకింతురు, "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన" అను శ్రుతివాక్యము యజ్ఞాదులు చిత్తశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారమునఁ గైవల్య సాధనములని బోధించుచున్నది. శ్లో॥ యజ్ఞోదానంతపశ్చైవ పావనాని మనీషిణాం। అను శ్రీభగవద్గీతావాక్యము యజ్ఞము పాపక్షయ సాధనమని బోధించెడిని,

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మ। నత్యాజ్యం కార్యమేవతత్॥ అను గీతావాక్యము యజ్ఞమును జేయవలయుననియు మానకూడదనియు బోధించుచున్నది. "అశుద్ధమితిచేన్న శబ్దాత్" అను శారీరక బ్రహ్మసూత్రమందు యజ్ఞాదులయందుఁ జేయఁబడు హింస యజమానునకుఁ బాపావహ మగునని కొందఱు శంకింపఁగా వేదవిహితమగుటచేఁ పశ్వాలంభము పాపావహముకాదని శ్రీవేదవ్యాసమహర్షిచే బోధింపఁబడియె. "నహింస్యాత్సర్వాభూతాని" యనునది యుత్సర్గశాస్త్రమనియు, "అగ్నీషోమీయం పశుమాలభేత" ఇత్యాదు లపవాదశాస్త్రములనియు శాస్త్రానుజ్ఞలేకయే స్వచ్ఛందముగఁ జేయఁబడిన ప్రాణవియోగానుకూల వ్యాపారమే యధర్మమనియు శ్రీభగవత్పాదాచార్యులవారు భాషించిరి. ఇటులనే శ్రీరామానుజాచార్య మధ్వాచార్యాదులును నొడివిరి. "అహింసన్సర్వభూతాని అన్యత్ర తీర్థేభ్యః" ఇత్యాది శ్రుతికదంబమునందీయర్థము విస్పష్టముగ వక్కాణింపఁబడి యున్నది. కాన పశ్వాలంభ మధర్మమనుటతప్పు 'మన్యుఃపశుః తపోగ్నిః" ఇత్యాది శ్రుతివాక్యము జ్ఞానకాండాంతర్గతము. ఇదియొక యుపాసనను బోధించునని భాష్యకారులు స్పష్టీకరించిరి. యాగీయపశ్వాలంభము కర్మాధికారి విషయము. ఇట్టికార్యము మంచిదనికాని చెడుదనికాని బోధించుటయందీ వాక్యము సమర్థముకానేరదు. ఈసంగతి శాస్త్రజ్ఞులకు విశదము. శాస్త్రగంధమునే గురుతెఱుగని పామరులీ న్యాయనిర్ణయముఁ జేయుటకై సాహసించుట కలికాలవిలాసము కాని వేఱుకాదు. 'కుర్యాద్ఘృతపశుంసంగె కుర్యాత్పిష్ట పశుంతథా। నత్వేవతువృథాహంతుంపశుమిచ్ఛేత్కదాచన' యనువాక్యము పశ్వవయవభక్షణాసక్తి కలిగినప్పుడు ఘృతపశువునైనను పిష్టపశువునైననుఁ జేసి దానియవయవములను భక్షింపవలయుననికాని యవిధిపూర్వకముగాఁ బశుహింసఁ జేయఁగూడదను నర్థమును బోధించుచున్నదని సంగేయను శబ్దస్వారస్యమునుబట్టి కుల్లూకభట్టీయములో నొడువఁబడియె. 'వృథా' యనుశబ్దమునుబట్టియు నీయర్థమే లభించుచున్నది. పిష్టపశుయాగమే శాస్త్రసిద్ధమనఁ

బోయెదమేని "ఛాగస్యవపాయా మేదసోఽనుబ్రూహి" ఇత్యాదివాక్యముల స్వారస్యము చెడును. 'అపాం పేరురసీత్యపః పాయయతి' యను వచనము పశువును నీరు ద్రాగింపవలెనని బోధించుచున్నది. పిష్టపశువు నీరు ద్రాగించుటెట్లు? 'యదినపిబేత్ బలాదేనం పాయయతి' అను వాక్యము పశువుదకపానముఁ జేయనిచో బలాత్కారముగ నైనఁ ద్రాగింపవలెనని బోధించుచున్నది. ఇట్టిపని పిష్టపశువునం దెట్లు సాధ్యమగును? మంత్రములందుఁ జెప్పఁబడని పనిని సాహసించి మనమాచరించితిమేని యది యధర్మమగుఁగాని ధర్మము కానేరదు. ప్రాణప్రతిష్ఠవలనఁ బిష్టపశువునకు బ్రాణలాభము కల్గునంటిరేని అట్టిదానిని హింసించుటయు నధర్మమే కదా. ప్రాణప్రతిష్ఠ చేయఁబడిన దేవాలయములోని విగ్రహముఁ బగులగొట్టుట యధర్మమని కదా ఆస్తికులెల్లరంగీకరించెదరు, గాన ననాదిసిద్ధములును ప్రమాణరాజములునగు వేదములయొక్కయుఁ దదర్థనిర్ణాయకములగు స్మృతులయొక్కయు నాజ్ఞానుసారముగాఁ జిత్తశుద్ధికాములగు ద్విజులాచరించు యజ్ఞాదుల దూషించువారలు వేదనిందకులగుటంజేసి యనాదరణీయులు, వారివచనములు ధర్మవిరుద్ధములగుటంజేసి పాటింపఁదగినవి కావు, వారిమాటలు న్యాయనిబద్ధములేమో యని సామాన్యబుద్ధికల పామరులకుఁ గలుగు భ్రమనివారించుటకై యీయుపన్యాసము బ్రచురింపఁబడియె. అనాదిదుర్వాసనావశంబునఁ బ్రతిహతమనస్కులగు మూర్ఖులతృప్తికై వ్రాయఁబడలేదు. 'నతు ప్రతినివిష్టమూర్ఖజనచిత్తమారాధయేత్' అనియు 'జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపినరం నరం జయతి', అనియుఁ బ్రాజ్ఞుఁడగు భర్తృహరి నుడివెను. గాన నోసుజనులారా! శాస్త్రజ్ఞానములేనట్టియుఁ బ్రమాణనిబద్ధులుకానట్టియు నాస్తికజనసహవాసదూషితచేతస్కులయినట్టియు పామరులవాక్యములనాదరింపక శ్రుతిస్మృతిశరణులై విహితధర్మంబుల నాచరించి కృతార్థులగుఁడు. యుద్ధము హింసాయుక్తమగుటంజేసి యధర్మమని యర్జునునకు భ్రమము కలుగఁగా సర్వజ్ఞుఁడును ధర్మసంస్థాపకుఁడునగు శ్రీకృష్ణుండాజ్ఞయొసంగినదిదియే. మీకిట్టి దృఢనిశ్చయముఁ గలుగఁజేయుటకై మాయభిప్రాయములకు వ్యతిరేకముగ వాదించెడివారలకుఁ గూడ నిట్టి సత్సంకల్పములు గలుగఁజేసి యుద్ధరించుటకై సర్వశక్తులుగల పరమేశ్వరుని బ్రార్థించుచు నీవ్యాసమును ముగించుచున్నవాఁడను.

ఇటు,

సనాతన ధర్మాభిమాని
విద్వత్సమాజానుమతః
మల్లాది రామకృష్ణశాస్త్రి
సోమయాజీ

చంద్రికా ప్రెస్, గుంటూరు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# పురశ్చరణము.

చదువరులారా! యిందు మాపాశుపతమున మున్ను చర్చించినవిషయములే మరలఁ బ్రసక్తి కలుగుటంజేసి పిష్టపేషణ మొనర్ప వలసి వచ్చినది. ఆప్రసక్తి మాశిష్యులు చేసిన "పరాస్తపాశుపత" నామక ముగునవకతవకప్రసంగమే, "పాశుపత" ఖండన మెట్టులున్నను ముందు దానికి ననుగుణమైనపేరేని మా "దైవవంచితులకు" స్ఫురించినది కాదు. ఈముగ్ధులకు స్ఫురింపకున్నను వీరి "సేమమునుజూచు తాతలు" కేని స్ఫురింపకుండుట శోచనీయము, సిద్ధములుగూడ "దైవవంచితులకు" సమయమునందుఁ బొడకట్ట వనుటకు మనకు గురుశాపదగ్ధుఁడగు కర్ణునిచరిత్రమే బోధకము, అది యటులుండె "పాశుపతము" పైఁ బ్రసరింపఁ దగినదే రెయ్యదియో తెలుపవలసి యున్నది. అది బ్రహ్మదండము. దాని క్రిందిగ్రంథ ముద్బోధకము.

(వాల్మీకిరామాయణబాలకాండమునుండి)

శ్లో॥ తస్యాఽస్త్రం గాధిపుత్రస్య ఘోర మాగ్నేయ ముద్యతమ్,
బ్రహ్మదండేన తచ్ఛాంత మగ్నే ర్వేగ ఇవాఽంభసా, వారుణం ...
పాశుపతం తథా వసిష్ఠో గ్రసతే సర్వం బ్రహ్మదండేన రాఘవ॥

---

పైప్రమాణముం బట్టి పాశుపతముపైఁ బని చేయునది బ్రహ్మదండ మని విస్పష్టము, మాముగ్ధుల కింతపరిశీలనాజ్ఞానమే యున్నచో నొప్పులు తప్పు లని వదరి తెగ వెక్కిరించి, దానిచే శిర మాధారచక్రగత మగుటయుఁ, దాని నట నుండి యుద్ధరించుకొనుటకై మరల నేవో వెఱ్ఱిప్రయత్నము లొనర్చి "భక్షితేఽపి లశునే న శోకశాంతిః" అనులోకోక్తికిఁ బ్రథమలక్ష్యము లగుటయు నెట్లు ఘటించెడిని? నామకరణవిచార మింతతో ముగించి యిఁక నిందలివిషయములనుగూర్చి ముచ్చటింతము, ఇది సర్వవిధముల నీ॥వెం॥రా లశిష్యుఁడ నని యొక దేవయ్య ప్రచురించిన "పాణిగృహీతాశ్రవణానందశృంఖల" కుపాధ్యాయప్రాయముగ నున్న దని మాచదువరు లెఱుంగుదురు కాక, అట్లుండుటంజేసి దానికిఁ బట్టించినగతియే దీనికిఁగూడఁ బట్టించుట యుక్తము. గాన దానివలెనే యీపరాస్తపాశుపతనామక పుంజొప్పబెండుగూడఁ దృణీకరింపఁబడుచున్నది, సహృదయాః ప్రమాణమ్॥

(1) "యజమాని"

ఇట - "పుంరోగమున జీవు రా॥ దని చెప్పుట కాధారము నున్న. దీక్షితుల

వ్రాసినయక్షరములు "టిద్ధాణఞ్" "ఉగితశ్చ" అనుసూత్రములవలన వచ్చెడి జీప్ప్రత్యయమునే వారించెడినిగాని యన్యమును లేశమును వారింప నేరవు. ఆయక్షరములుదాహరింతము.

సూ॥ టిద్ధాణఞ్...... "వక్ష్యమాణేత్యత్ర టిత్త్వా దుగిత్త్వాచ్చ జీప్ ప్రాప్తః యాసుటో జిత్త్వేన "లాశ్రయ మనుబన్ధకార్యం నాఽఽదేశానా మితి జ్ఞాపనా న్న భవతి, శ్న శ్నానచ శ్నిత్త్వేన క్వచి దనుబన్ధకార్యే ఽప్యనల్విధా వితి నిషేధా ద్వా"

ఈయక్షరములయర్థము మాముగ్ధులమా టట్టులుండ, తద్రక్షకులకుఁగూడఁ జక్కఁగాఁ దెలియదని వారిచట వాదించువాదముంబట్టియే నిర్ణయింప వచ్చును. ఇంత మాత్రపుఁదెలివితో నీ "దైవవంచితులు" వైదికులనెట్లు తూల నాడుచున్నారో చూడుఁడు.

'యజమానాన్యా భర్తుః' మొదలగువైదికశబ్దములు పాచకులకుఁగాని శాబ్దికులకు సమ్మతములుగావు'

వైదికశబ్దములఁట- అనఁగా; వేదములోనిశబ్దములు గావు. అగుచో నవి శాబ్దికులకు సమ్మతములేల కాకుండెడిని. పైఁగా నీప్రయోగము వేదములోని దని యెవఁడనుకొనును? వైదికులు, అనఁగా యాజ్ఞికులు సంప్రదాయసిద్ధముగా వాడుశబ్దములఁట? ఈనక్షత్రసూచు, లకఁట? సమ్మతములు గావఁట? ఆయాజ్ఞికులు శాబ్దికజీవులుగాని శాఽఽబ్దికజీవులు కారు కావుననే 'యజమానస్య భార్యా' యజమానీ అనునర్థమున నిర్బాధమగు జీప్ప్రత్యయమును గైకొనిరి. ఈజీషు టిత్త్వప్రయుక్తము గాని, ఉగిత్త్వప్రయుక్తము గాని కాదు. జీప్పు గాదు, మోఽఱకుల కెంత తెల్పినను దెలియదు. గాన నింతతో ముగించుచు 'క్షమాపణ నిందుగ్రామ్య' మన్నమాటి కిది తప్పనుట యొకయక్కజముగా దని తెల్పుచు, దానివలనఁ గల్గినపరాభవమున కొప్పికొనియనుభవించుచున్నట్టే దీనింగూడ ననుభవింప వలసిన దని కోరుచున్నారము. శ్లో॥ "అవశ్య మను భోక్తవ్యం కృతం కర్మశుభాఽశుభం॥

(2) "ధౌమ్యులు ప్రవేశించును, వ్యాసులు ప్రవేశించును"

ఇందులకు మనుచరిత్రవ్యాఖ్యానమునుండి మాచూపిన—

"కృష్ణరాయలు ...... జయించెను"

అను నుదాహరణము పనిచేయదఁట?, అతఁడు గూడ మాతోపాటు దానిం దిద్దికోవల

సినవాఁడే యగునఁట? మాకర్మము కాలి యీ "నక్షత్రసూచుల" తప్పుడుఁగూఁతలకు మేము పాత్రుల మైన నగుదుము కాక పాప మయ్యనఘుఁడు గూడ నట్లే కావలసివచ్చె నేమి, అది యటులుండే, పైఁగా భారతమునుండి చూపిన—

క॥ "మాయయ్య యెవ్వ రెక్కడఁ బోయిరి"

అనునుదాహరణమఁట? పద్యములో నున్నదియఁట? మాగద్యములు కూనుగద్యములఁట? ఇందలిప్రయోగములకఁట? విచ్ఛిత్తివిశేషమునకై కొండొకచో వాడినపద్యగతప్రయోగములు పనిచేయవఁట? ఎంమల కీపిచ్చిప్రలాపన మని యిది వఱకెందఱో మందలించి నను నోరు మెదుపుమాదేవయ్యల కెప్పుడేని బుద్ధి గల్గునోకో? ఏదియో ప్రేలుటయే వృత్తిగా నేర్పఱచుకొని యదియే జీవనాధారముగ వర్తించువీం డ్రెట్లు ప్రేలిన నడుగువా రెవరు? శ్లో॥ అలాభోపహతా శ్చాన్యేజీర్ణ మంగే సుభాషితం॥ పైప్రయోగముం గూర్చి పాశుపతమే విశేషించి తెల్పును గాన నిట విస్తరింపవలసినది లేదు.

(3) ఇదుగో, ఇడుగో, ఇరుగో, అరుగో,

ఆయీరూపములంగూర్చి పాశుపతమున విస్తరించి బోధించి వ్రాసి యుంటిమి, అందు, ఇయ్యవి ప్రతిపదోక్తావ్యయము లనియు, కళ లనియు, నొక్కి వక్కాణించి యుంటిమి, ఆయీసందర్భములకుఁ దగినఖండనోపాయము దొరకక యేవో కొన్నిమాటలు వదరి, కొంత దుఃఖము దీర్చికొని—

'మీఁదుమిక్కిలి యవికళలఁట?'

అని యొకయంకె వేసిరి. అవి కళలు కావేమి, కానిచో—

"క॥ ఈరుధరేంద్రము లోకా। లోకపుబల్గోడఁ దట్టి లోనికటా
ద్రుల్। మేకులుగాఁ జేయుచు నది। గోకానంబడియెఁ దెల్లగొ
ల్లెన భంగిన్" (వరాహపురాణము)

అను మహాకవిప్రయోగము కుదురుటెట్లు, శబ్దరత్నాకరకర్త కీప్రయోగము దొరకక దొరకినకళాపూర్ణోదయప్రయోగమును సాధించుటకు గత్యంతరమున్న దని యెఱుక పడక ద్రుతాంతముగను, లాక్షణికముగను వ్రాయవలసి వచ్చినది. ఆ ట్లతఁడు భ్రమించినచోట్లు మఱికొన్ని గలవు, "గచ్ఛతస్ఖలనం న దోషాయ" కళాపూర్ణోదయప్రయోగముకన్న వరాహపురాణప్రయోగ మేవిషయమునంగాని తీసిపోవునది కాదు. పైపెచ్చు దీనికన్న నది చాలఁ బ్రాచీనము. దిద్దుద మన్నఁ బ్రాసస్థానమందున్నది. కాఁబట్టి

యోజింపుడు, ప్రయోగములలోనే యియ్యదియు వదరుఁబోతులనోర నొక్కఁబడియే యని విజ్ఞు లరయుదురుగాక, యోచనతప్పనియు, యోజన,యే సాధు వనియు నింతకు మున్ను ప్రాసస్థానమ్మునందుఁ బ్రయోగ మిచ్చి వాకట్టు కల్పింపఁబడినది. అందులకే మఱియొక మహాకవిప్రయోగము—

క॥ రాజా! యేమని చెప్పుదు। నాజగతీసురుని మొదటియిల్లాలువ
యుసు ధా। త్రీజనులు రోయునప్పటి। యోజన కాశ్చర్య మ
య్యె..., (నిరంకుశోపాఖ్యానము)

ఈయోజనా విచార మిటు లుంతము. దీనింగుఱిచి మావేఁదుఱుశిష్యులు ప్రకృత మించుకయుఁ బ్రలపించినవారు గారు, కావున నిది చచ్చినపాముం జంపుటవంటిది, ప్రకృత మిదుగో, విచారము, ఇం దిఁక నొకమాట బొత్తిగాఁ జెల్లితక్కువను వెలిఁ బెట్టు నట్టిది వ్యయము చేసిరి.

“ప్రకృతిప్రత్యయజ్ఞానము కలవా రెవ్వరును ‘ఇదుగో, ఇదుగో, మొదలగు శబ్దముల నొప్పరు”.

ఒప్పరేమి, ఈమాట ప్రకృతిప్రత్యయజ్ఞానమున్నవాండ్రు వ్రాసినదే యగునోటు? అగుచో, నట్టివాండ్రు ఇదుగో శబ్దము నొప్పకున్నను ఇదిగో శబ్దము నొప్పదురుగదా. ఆయొప్పుట, ఇది అనునది ప్రకృతి యనియు, గో అనునది ప్రత్యయ మనియు' ననుకొనుటవలననే కాఁబోలు? పోలు? పోలు?, ఎందుల కీపిచ్చివ్రాఁతలు, కలిగినంతలోఁ దిని కూర్చుండినచోఁ గొంత గంభీరులుగా నుండవచ్చునుగదా? ప్రతిపదోక్తావ్యయము లని మేము వ్రాసియుండఁగా దానింగూర్చి మాటలాడుచు మధ్య నీచేతఁగాని ప్రసంగ మెందులకు? «ఎన్నాళ్లైనది యన నాలుగెల లైన» దనునట్లుండుట యుక్తమో కాదో, లోలోన యోజించుకొందురుగాక, మఱియు నిట్టి తెల్వితక్కువమాటలనే «చిగురు» శబ్దవిషయమును ఖండించుచు వెళ్ళఁ గ్రక్కిరి చూడుఁడు.

“చివరయనుటకు గ్రామ్యులెవరో చిగు ర,ని వాడుచుందురు గాక .....లోకమున నెన్నిశబ్దములు వికారమును బొందుచుండుట లేదు .....ఓహో! గ్రామ్యభాషాదేవతా.....”

ఇత్యాద్యపలాపముల కర్థమేమైనఁ గలదా. ఈమావేఁదుఱువదరుఁబోతులకు గ్రామ్యశబ్దార్థము తెలిసిన నిట్లు వాగుదురుకదా, పైవ్రాఁతవలన ‘చివర’ శబ్దమునకు ‘చిగురు’ శబ్దము గ్రామ్య మని తేల్చుచున్నారు. ఇది యింతకు మున్ను చూపినప్రకృతి

ప్రత్యయజ్ఞానప్రసంగమునకన్న శోచ్యదశలో నున్నది. వ్రాఁత సర్వమును శోచ్యదశలో నున్నప్పుడు దీనికై యింత శోకింపఁ బని లేదు. నిష్కృష్టాంశ మిది, చిగురు, చివరయుఁ గాని, చివర, చిగురునయుఁ గాని గ్రామ్యములు గావు. గ్రామ్య మని మన మేపదము నందుమో? దానికి నదే యర్థము గలవేఱొకపదమును జూపవలసి యుండును. ఆ పదము కొంచెము భేదమాత్రమే కలిగి తాదృశానుపూర్వియే కలదిగా నుండవలయును. ప్రకృత మానుపూర్వీసామ్య మున్నను, అర్థైక్యము లేశమును లేదు. కావున వీనిలో నొకటి కొకటి గ్రామ్యములుగాఁ జెప్పఁ గూడదు. అగుచో «చివర» యను నర్థమున మీరు చిగు రని యేల ప్రయోగించితి రందురా, ఇందుంగూర్చి యౌపచారిక మని మున్నే వ్రాసి బోధించి యుంటిమి, కాన నిందు విస్తరింపఁ బని లేదు. ఇటీవల నఁగా? మాపాశుపతము చదువకమున్న వెం॥ రా॥ లు ప్రకృతవిషయమున వ్రాసిన వ్రాఁత యెంత ముద్దుగా నున్నదో చూడుఁడు.

"వెంద్రుక మనుష్యశరీరమున కగ్రభాగ మగుశిరమం దుండును గాన దానికిఁ గూడ నిట్టియర్థము చెప్పవచ్చును గాఁబోలును".

ఈముద్దుమాటలలోఁగూడ లోకజ్ఞానము పూజ్యమో కాదో విచారింపుఁడు. వృక్షమున కెక్కడఁ జూచినను, చిగురు (పల్లవము) శాఖోపశాఖలతుట్టతుద నుండును. అది నిజమే. అట్లే వెంద్రుకలుగూడ మా వెం॥ రా॥ లనుకొనునట్లు శిరమందే యుండెనేని చెప్పనే వచ్చును. ఇవి యటులుండుట యనుభవసిద్ధము కాదు. మూతి యందు, ముక్కునందు, ము+యందు, చం+యందు ఇంకను నెన్నో చోటుల నుండును గాన దీని కట్టి లాక్షణికార్థము కుదుర దని బుద్ధి చెప్పవలసి వచ్చినది. ఇంత తెల్వితక్కువగాఁ దాము ప్రసంగించుచు నీప్రసంగముతుదను

"లాక్షణికార్థ మెట్టిచోట్లఁ జెప్పవలయునో యాలంకారికుల నడుగుఁడు"

అని శాసించుచున్నారు, లజ్జ యున్నంగదా, అది లేనియప్పు డన్నరుఁ డేవ్రాఁత వ్రాయఁడు ఏకూఁత గూయఁడు? ఈక్రిందియపలాపమును జూడుఁడు—

"ఇంతకు మున్ను ముద్రింపఁ బడినపాండవాశ్వమేధపుఁబ్రతులు ఖర్చు కాకుండఁగనే వేంకటశాస్త్రిగారీమధ్య నానాటకమును మరల నచ్చు వేయించి"

ఏమి చెపుమా, అశ్లీల యచ్చువేయించిరో, వెం॥ రా॥ ల తప్పడుశతఘ్నిని గృష్ణాముఖ

ముక నామరూపశూన్యముగాఁ జేయునప్పటికే యది పునర్ముద్రణమునకు వచ్చి యుం డుటయు, దానికొఱ కొందఱో చదువరులు సుమా రొకవత్సరము వేచి యుండుటయు సర్వజగద్విదితమే యగుటచే నీప్రలాపమున కుత్తర మనావశ్యకము, ఇది 'శృంఖలలో' వీంద్రశిష్యాపశదుఁడు చేసిన—

"ధాతురత్నాకరమఁట? కాళీసహస్రమఁట? శృంగారశృంగాట కమఁట? ఎక్కడనున్నవో? ...... ధాతురత్నాకరము, శృంగారశృం గాటకము లేవు ... ఆలు లేదు, చూలు లేదు, కొడుకుపేరు సోమలిం గమఁట?"

అను నరణ్యరోదనమున కుపాధ్యాయప్రాయు మని విజ్ఞు లరయక పోరు, కాన నిట్టిప్రల్ల దముల ఖండింపఁ బూనక శాస్త్రవిషయచర్చ కుపక్రమింతము—

(4) శ్రుతపఱచు, శ్రుతపఱుచు,

ఇవి రెండును సాధువు లని వ్రాసి యందులకు శబ్దరత్నాకరము జూచుకోవలసిన దని మేము బోధించి యుంటిమి, ఆయీమాత్రాంత దూరదృష్టి లేనివ్రాఁతయఁట! అచట వీరి కువాదోద్ధరణమునకుఁ గంఠోక్తముగా నేదో యున్నదఁట, ఆయున్నదాని నిందు లిఖించి మందలింతముగాక—

"పఱచు,......క॥ భంగించి యితరకాంత దొఱఁగుట తప్పా తడం బఱచి పురుషులకుఁ" కళా— ౭, ఆ, ... (ప్రేరణార్థకమాయిన పఱచు, ఒకన్యాయమును బట్టి ఉకారమధ్యముగా నుండవలసి యున్నను వ్రాఁతప్రతులయం దంతట, తఱచుగా, అకారమధ్యముగా నుండుటవల్లను, ఒకప్రామాణికకవిప్రయోగమున యతియందు, కానఁ బడుటవల్లను, ఇట్లకారమధ్యముగానును వ్రాయఁబడెను.)

అని వ్రాసి మరలనుకారమధ్యములు వ్రాయుచు

"పఱుచు"...(అను ప్రయుక్తమైన పఱుధాతువునకును రూప మి ట్లిఱుంగునది.)

అని లిఖించెను,దీనివలన నేమి తేలుచున్నది. పూర్వమహాకవిలిఖితములగు ననే కగ్రంథములలో నిట్లకారమధ్యరూప ముపలబ్ధ మగుచున్న దనియు, దానిం దిద్దుద మన్న నొకమహాకవి యతిస్థానమునఁగూడఁ బ్రయోగించుటచే వలనుపడకున్నది యనియుఁ గావున విధి లేక యకారమధ్యమునుగూడ నొప్పక తప్పక వచ్చినదనియు, నా కభీష్టమైనదిమాత్ర ముకారమధ్యరూపమే యనియుఁ దేలుచున్నది. ఇతని కిష్టము

లేకున్నను నితనితాతముత్తాతలకది యిష్ట మని వారివారిప్రవృత్తివలన సిద్ధ మగుచున్నది. తథాచ మతభేదేనోభయరూపసిద్ధిః "సర్వపథీనాః కవయః'' మఱియు

"తడఁబడుచు కన్యథా గతి యున్నది."

అని యొకబొంకు బొంకి యంతలోనే ముగింప నేల వలసెనో, వట్టి చెత్తతుక్కుప్రసంగముతోడనే చాలపుటలు చెఱచి యేవో నాలుగుమూడు పుటలుమాత్రము ప్రధానవిషయమునకుఁ గా వనుసరించినమాదేవయ్యల కాగతి యెట్టిదో బయటఁబెట్టుటలో వచ్చిననష్టి యేమో విజ్ఞులు విచారింతురుగాక, తప్పుడుకూఁతలు గూయుదేవయ్యలకుఁ గలగతియే దానికిని గల దనియు, దానికిఁ జూపఁ దలఁచినగతిని బైటపైచిన యుత్తరక్షణమే యాగతిని దుర్గతిగాఁ జేసెద మనియుఁ గంఠోక్తిగాఁ జాటుచున్నారము.

(5) "నిగుడ్చి

దీనిం గూర్చి సపాశుపతాశ్వమేధపీఠికలో నెఱ్ఱనహరివంశమునుండి యతిస్థానమున—

"కుంభపీఠమ్ము పగుల్చి మఱియు"

అనుప్రయోగ మీఁబడి యున్నది. ఆసందర్భమును జూడనియట్లభినయించుచుఁ జిన్నయ్యసూరి సంస్కరించి యచ్చొత్తించిన పొత్తములో నున్నవని చెప్పినప్రయోగపరంపరల నెల్లఁ ద్రోసివేయ నుద్యమించుమాదేవయ్యల యవస్థకు వందురనివా రెవ్వరు? 'యతిస్థానము' యతిస్థానము, ఎఱ్ఱన్న, శంభుదాసుఁడు కవిత్రయములోనివాఁడు, ఇప్పుడేని తెలిసినదా? ఇఁక నోరు కట్టుట యుక్త మేమో''

(6) "రక్కసు లందఱిని దునిమి రక్తమది తనదేహంబంటు"

ఇందున్న "రక్త మది" యనుచోటఁ గల "అది'' యనుదానిం గూర్చి తెలివితక్కువతనముచే నోరు తెఱచి వెక్కిరించిరి. భారతప్రయోగములను జూపి మేము శిరోభారమును బూర్తిగాఁ దగ్గింపఁగా మరల "క్రిందఁ బడియు మీఁదివాఁడ'' నని చెత్తప్రసంగమునకు మొదలిడి భారతమునందలి

"హాస్తిపురంబది రాజధానిగన్"

అనుచోఁ గల "అది'' ప్రసిద్ధార్థక మనియు నిది యట్టిది గా దనియు, నది విచ్ఛిత్తివిశేషాపాదక మనియు నిది యట్టిది కా దనియు వ్రాయుచుఁ గొన్ని దుడుకుఁ గూఁతలు కూయఁ జొచ్చిరి. అది, తా, వీనిం గూర్చి పాశుపతములో వ్రాసినసంగతులపై నేమియు వ్రాయ వీలులేక వదరువదరులవలనఁ జీవాట్లుతక్క ఫలాంతరము గలుగుట దుర్ఘటము. "హాస్తిపురంబది" అనుప్రయోగమటులుంతము.

"చ॥ శిరమున కొప్పు నర్చనలు సేసినపువ్వులయవ్విధమ్మునన్"
ఇందలి "పువ్వులయవ్విధమ్మునన్" అనుచోఁ గల తచ్ఛబ్దార్థకమున కేప్రసిద్ధార్థకత్వము గల్గెడిని? "పువ్వులవిధమ్మునన్" అనినం జాలును గదా? తెలిసీ తెలియనిమూర్ఖుల కేమిబోధించినను బ్రయోజనకారి కాదు,

(7) "కర్ణుఁడు దుర్ణయుం డగుచు"

ఇట "దుర్ణయ" తప్పనియు దుర్నయ అని దిద్దవలయు ననియు మొదట వెం॥ రా॥ లాక్షేపించిరి, దానిపై భారతములోని—

"దుర్ణయుల్ శకునియుఁ గర్ణదుశ్శాసనుల్"

అను దురుద్ధరప్రయోగమును, మఱియు నిట్టి దిద్దరానివియే యగు శ్రీనాథ పెద్దనాదులప్రయోగములును జూపి శాస్త్రవిషయక మగు సమాధానమునుగూడ వ్రాసి పాశుపతములో బుద్ధి గఱపి యుంటిమి. అంతతో ముగియవలసిన యీయనివార్యసమాధానము నన్యథాకరింపఁ దలఁచి భారతప్రయోగమును—

"దుర్నయుల్......కర్ణదుశ్శాసనుల్"

అని దిద్ది నన్నయ్యభట్టారకున కిట్టిచండాలపునఃప్రాసముకూడ నిష్టమని యపవదింపఁ దొడఁగి యంతం దనివి సనక

"నన్నయ మఱికొన్నిచోట్ల బాహిరముగా నఃప్రాసము వాడినాఁడు. నన్నయభట్టారకునిమతము సాధారణుల కెట్లు తెలియును. సిద్ధాన్తకౌముదీగంధ మెంతమాత్రము నిలిచిన నీతప్పు వెం॥శా॥ గారికిఁ గలుగకుండెడిదిగదా......"

ఇత్యాది నీచాతినీచోక్తులు వ్రేల మొదలిడిరి, ఈవెఱ్ఱి కుఱ్ఱలెట్లో వదరుదురుగాక, పాపము! పెద్దలు విద్వాంసులును నగు బ్ర॥శ్రీ॥ ఆకుండివ్యాసమూర్తిశాస్త్రిల వారిచేఁ గూడ నీగ్రుడ్డిత్రోవయే యనుకరింపఁ బడిన దని వ్రాయుటకుఁ జాలఁ జింతిల్ల వలసి యున్నది. మఱియొక సంచికలోనేని గాక, ఈతప్పుడుఁ బ్రసంగము ప్రచురించిన సంచికలోనే "భారతఫక్కి" లో, వ్యాసమూర్తి శాస్త్రిలుగారు వ్రాసినట్లున్న వ్రాఁతం జూడుఁడు

"దుర్ణయమున శకునికర్ణదుశ్శాసనుల్"— అను సర్వప్రాన సీసమునాటగీతిని "దుర్నయమున" అని యుండ వలయును "దురస్తత్వణత్వయో రుపసర్గత్వప్రతిషేధో వక్తవ్యః" "ఉభయప్రాసము భట్టారకునకు సమ్మతంబు" "అక్షౌహిణీయా।నిరంతరప్రమాణసంఖ్య" ప్ర, ఆ, 80,,

# విగ్రహారాధన

విశాఖపట్టణముజిల్లా బొబ్బిలినగరవాస్తవ్యులును, ప్రకృతము గంజాంజిల్లా బరంపురపు రాజకీయకలాశాలోపాధ్యాయులును, నగు సుసర్ల కామశాస్త్రిగారు శ్రుతిస్మృతిభాష్యాదివాక్యములకుఁ దమబుద్ధికిఁదోఁచినతాత్పర్యమును గల్పనచేసి ప్రకరణాదికమునుగనిపెట్టక ప్రతిమార్చనను దానినాచరించెడి శిష్టులను గొందఱఁ బూర్వనిబంధనకర్తలను నిందించుచు నొకగ్రంథమువ్రాసిరి. లోకమునఁ దఱచుగా జను లల్పబుద్ధిగలవారగుటవలనను వేదమార్గప్రవృత్తి లోపించుటవలనను శరీరాదుల కాయాసమును గలుగఁజేయుచుఁ బరలోకసుఖమాత్ర ఫలకమగుకర్మయొక్క పరిత్యాగమందు ప్రజ స్వయముగనే ప్రవర్తించుటవలనను స్వయముగా గ్రంథములను బరిశీలించుకొనలేని మిగిలిన కొంతమందియాస్తికుల బుద్ధి యిట్టి యప్రమాణగ్రంథములయవలోకనమాత్రముచే మోహమునుబొందిపోవుననియు నందువలన నంధగోలాంగూలన్యాయముగా శ్రేయోమార్గమునుండి భ్రష్టులగుదురనియుఁ దలఁచి యట్టియాస్తికుల కిత్యాదులువ్రాసినగ్రంథములందు సారము లేదని తెలుపుటకొఱకు నీశాస్త్రిగారిగ్రంథము ననువాదముచేయుచు నాకుఁదెలిసినంతలో నాకుసంభవించినప్రమాణములనుబట్టి విషయశోధన చేయుచున్నవాఁడను.

విచారింపఁగా లోకము భిన్నరుచిగల దగుటవలనఁ గొందఱ కట్లు ప్రవృత్తియుండినను మాబోంట్ల కేమియు బాధలేదు. అయినను శ్లో॥ శక్తోయస్థాపితుంధర్మముపేక్షాంకురుతేనరః। సోసిపత్రవనంనామ నరకం ప్రతిపద్యతే॥ ధర్మస్థాపనచేయుటయందు శక్తిగలిగియుండియు నెవ రుపేక్షచేతురు వారు లసిపత్రమనుపేరుగల నరకమును బొందుదురు. శ్లో॥ యస్థాపయితుముద్యుక్త శ్శ్రద్ధయైవాక్షమోపిసః, సర్వపాపవినిర్ముక్త స్సాయుజ్యమవాప్నుయాత్॥ శక్తిలేకపోయినను ధర్మస్థాపనచేయుట కెవరుప్రవర్తింతురో వారు సర్వపాపవినిర్ముక్తులై యుత్తమలోకమును బొందుదురు. ఇత్యాదిసూతసంహితాప్రమాణ

ములవలన శక్తియున్నంతలో వైదికమతోద్ధారమందు యత్నము చేయుట ధర్మమైయున్నయది. శ్లో॥ బిభేత్యల్పశ్రుతాద్వేదో మామ యం ప్రతరిష్యతి। ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్॥ కొంచెము చదువుకున్న వారినిజూచి వేదము తనకపార్థము చెప్పునని భయపడుచుండును గావున నితిహాసపురాణాదులవలననే వేదమున కర్థనిర్ణయము చేయవలయును- అను భారతవచనమువలనను శ్లో॥ యశ్చతుర్వేదవిద్విప్రః పురాణం వేత్తినార్థతః। తం దృష్ట్వా భయమాప్నోతి వేదో మాం ప్రతరిష్యతి॥ నాలుగు వేదములుచదివినను బురాణ మే బ్రాహ్మణునకుఁదెలియదో యట్టిబ్రాహ్మణునిజూచి తనకపార్థము చెప్పునని వేదముభయమునుబొందును. అనుస్కాందవచనమువల్లను నుపబృంహణానుసారముగానే శ్రుత్యాదులకుఁ దాత్పర్యముఁ జెప్పవలయును, అటు గాక తమకుఁ దోఁచినట్లు తాత్పర్యముఁ జెప్పినయెడలఁ బతితులగుదురు. ఎక్కడ శ్రుతికిఁగాని స్మృతికిఁగాని తాత్పర్యముఁ జెప్పవలసివచ్చునో యక్కడ నుపబృంహకమైన పురాణాది వచనముగాని శంకరాచార్యులు మొదలగు భాష్యకారుల వాక్యముగాని మాధవాచార్యులు మొదలగు స్మృతివ్యాఖ్యానకర్తల వాక్యముగాని తాము చెప్పినయర్థమందుఁ బ్రమాణముగా నుదాహరింపవలెను. అట్లుగాక శ్రుతిస్మృత్యాదులకుఁ తమబుద్ధిమాత్రముచేఁ గల్పించిచెప్పిన యర్థము బుద్ధిమంతులచే నెప్పుడు నాదరింపఁదగినదికాదు. పైనివ్రాసిన ప్రకారము శ్రుతివాక్యముల తాత్పర్యమును దెలియఁజేయు పురాణాదివాక్యములు కనఁబడుచుండగ పూర్వవ్యాఖ్యానకర్తలు చెప్పనితాత్పర్యము నెవరు చెప్పుదురో వారు శ్లో॥ యశ్చవిద్యాభిమానేన వేదమార్గప్రవర్తకం, ఛలజాత్యాదిభిర్జియాత్సమహాపాతకీభవేత్॥ ఎవఁడు పండితుఁడనను నభిమానముచే వేదమార్గమును బ్రవర్తింపఁజేయుపురుషునిఛలము, జాతి, మొదలగువానిచే జయించునో వాఁడు మహాపాపియగును. అను స్కాందవచనప్రకారము కేవల ప్రత్యవాయ భాక్కులగుదురు. ఛలమనఁగా నొకయభిప్రాయముగలవాక్యమునకు మఱియొకయభిప్రా

యమును గల్పించి దూషించుట; పరాశరులవారు వర్ణత్రయ సాధారణధర్మమును జెప్పుట కొఱకు "సంధ్యాస్నాన" మను శ్లోకమును వ్రాసినారని మాధవాచార్యులవారు తెల్పియుండఁగా దాని విడిచి వైదికాచారబాహుళ్యప్రవర్తనకొఱకు వ్రాశినారని మరియొక తాత్పర్యమును దనబుద్ధిచేఁ గల్పించి విగ్రహారాధనను దూషించుట యీఘట్టమున కుదాహరణము. జాతియనఁగాఁ దనకు భాదకరమగు మాట నితరమతమందుఁ బ్రయోగించుట. విగ్రహములు జడములగు పాషాణాదులచే నిర్మితములు కావునఁ దదారాధన చేయకూడదని చెప్పుచుఁ బ్రాణాదిపంచద్వారపారకోపాసన యావశ్యకమనుట యీజాతి కుదాహరణము. ప్రాణాదివాయువులుకూడ జడములగుచుండఁగా జడములగు విగ్రహముల యారాధన చేయకూడదనుట తమకే బాధకమైనది. కావున నిట్టి యయుక్తి ప్రదర్శకగ్రంథములు జాతిభూయిష్టములని చెప్పఁబడును. శ్లో॥ యోదద్యాత్ జ్ఞానమజ్ఞానాం, కుర్యాద్వాధర్మదర్శనం। సకృత్స్నాంపృథివీందద్యా త్తేనతుల్యంనతద్భవేత్॥ అజ్ఞానులకు జ్ఞానబోధగాని ధర్మబోధగాని యెవరు చేతురో వారిపుణ్యమునకు సమస్తపృథ్వీదానమువలనవచ్చు పుణ్యమైనను సమానముకాదు. అను స్మృతివాక్యానుసారము ధర్మబోధవలన విశేష ఫలముండుటచే శక్యమైనంతలో శిష్టమార్గమునకు విరుద్ధములయిన మార్గములు ముఖ్యముగా నిరాకరింపఁదగినవి. కావునఁ బ్రకృతమందు నాయత్నమును నాలాటిదయని తెలిసికొనునది. ఇటువైని విగ్రహారాధనచేయకూడదని నాకుప్రాసిపంపినవారి గ్రంథము నుదాహరించుచు దానివెంటనే తత్ఖండనము వ్రాయుచున్నవాఁడను.

వ్యాసాదిమహర్షులు ద్వాపరాంతమందుఁ గలిప్రవేశసమయమున వ్యాససహితముగాఁ బరాశరునిగూర్చి వెళ్లి యిట్లు ప్రశ్నము నడిగిరి. శ్లో॥ సర్వేధర్మాః కృతేజాతా స్సర్వేనష్టాఃకలౌయుగే। చాతుర్వర్ణ్యసమాచారం, కించిత్సాధారణంవద॥ ఈశ్లోకమునందుఁ గలియుగమందుఁ జతుర్వర్ణములవారును నెట్టియాచారపరులై యుందురో

యని చెప్పఁడని ప్రశ్న నడిగిరి. ఇందుకు సమాధానమునకై యీస్మృతి ప్రవర్తించినది.

ఈశ్లోకమునం దెట్టియాచారవంతులై యుందురను ప్రశ్నయో, యెట్టియాచారవంతులై యుండవలయునను ప్రశ్నయో. బుద్ధిమంతు లాలోచింతురుగాక. దీనికి వ్యాఖ్యానకర్తయగు మాధవాచార్యులు తనకుఁగల పాండిత్యప్రకటనకై తత్తద్రుషి భిన్నభిన్నాభిప్రాయబోధక స్మృతి శ్లోకముల వ్రాసినారు గాని యట్టిశ్లోకములు పరాశరస్మృతి సమాన ప్రమాణములుగా నేరవు.

ఈగ్రంథమువలన నేకొందఱు నిబంధనకర్తలను దూషించినారని యస్మద్గ్రంథప్రారంభమున వ్రాసియున్నాను. అట్టి మహానుభావుల ప్రవృత్తి పరోపకారార్థముకాని పాండిత్యప్రకటనకై కాదు. స్మృతివ్యాఖ్యానకర్తల దఱును దేశకాలాధికారానుగుణముగ ధర్మవ్యవస్థచేసి మందబుద్ధుల ననుగ్రహించియున్నవారు. అట్లుకానియెడల నిప్పుడుండెడి యల్పజ్ఞులకు ధర్మవ్యవస్థచేయుట కేమిశక్యముగు? కేవల దుష్పాండిత్యాభిమానముచేఁ గొందఱు ప్రవర్తించినఁ బ్రవర్తింతురుగాక. సర్వజ్ఞసిరోమణులగు మాధవాచార్యులచేఁ బ్రకృతానుపయోగములును నప్రమాణములును నగు వచనము లెట్లుదహరింపఁబడును? వారుదాహరించిన వటువంటివైనయెడల నున్మత్తవాక్యములవలె వారి గ్రంథములును నందఱిచే ననాదరణీయములగుచుండెడివి. కావున నమానుషకార్యనిర్మాణచాతుర్యధురీణులును, నఖిలపండితమండల వందితచరణారవిందులును, నఖిల వేదభాష్యనిర్మాణప్రకటీకృతపాండిత్య వైభవులును, నగు మాధవాచార్యులవారి వ్యాఖ్యానమునకుఁ దాము చేసిన యభిప్రాయముంగని సమస్తవిద్వాంసులును నత్యంతానందముం బొందుదురని శ్రీ కామశాస్త్రిగారు సంతసపడుచుండెరికాఁబోలు. అట్టి మహానుభావులనిందించినమాత్రమున మనబోట్లను మహాపండితులని యెవరును దలఁపఁబోరు. వారిగ్రంథమునకు సరియైన తాత్పర్యము జేకొనలేకపోవుటఁచేఁగలిగిన యపాండిత్యమే స్పష్టపడఁగలదు.

శ్లో॥ సత్వాధర్మప్రవక్తృభ్యోస్మృత్వాతద్వాక్యపద్ధతిం
అర్చాపూజాఖండనోక్తీః ఖండయిష్యే యథామతి॥

అట్టిపరాశరస్మృతిలో శ్లో॥ షట్కర్మాభిరతో నిత్యం దేవతాతిథి పూజకః। హుతశేషంతుభుంజానో బ్రాహ్మణోనావసీదతి॥ అను శ్లోకమునందుఁగల దేవతాశబ్దార్థము శాకల్యయాజ్ఞవల్క్యసంవాదములోఁ దుదకు సచ్చిదానందబ్రహ్మమేయని నిర్ధారణచేయఁబడ్డది. ఇట్లుండఁగా శ్లో॥ సంధ్యాస్నానం జపో హోమో దేవతానాంచపూజనం। ఆతిథ్యం వైశ్వదేవంచ షట్కర్మాణిదినేదినే॥ అనుశ్లోకమునందు మరల "దేవతానాంచపూజనం" అనుశబ్దము వినఁబడుచున్నది. ఉపాస్యదేవతాస్వరూపము ప్రథమశ్లోకమునందు నిర్ణయింపఁబడియుండఁగాఁ దిరిగిచెప్పుటకుఁ గారణము విచారణీయమైయున్నది. షడ్దర్శనభేదమునాశ్రయించి విష్ణుశంకరాదిదేవతాదిభేద మవిరుద్ధమని చెప్పుటకేకాని శ్రౌతమని నిర్ధారణకొఱకుఁగాదు. స్మార్తమయినను వేదవిరుద్ధపాంచరాత్రపాశుపతాదిదర్శనాంతఃపాతియగుట నశాస్త్రీయమనుట సాహసముకాదు. శ్లో॥ ఆదిత్య మంబికాం విష్ణుం గణనాథం మహేశ్వరం॥ అనుశ్లోకోక్తార్చనాక్రమము పాంచరాత్రపాశుపతాదిదర్శనములలో నంతఃపాతియగుట లేదు. వేదమందుఁ బ్రతిపాదింపఁబడలేదు. మూలకర్త కుంభీపాకవినిర్గత గౌతమశాపదగ్ధబ్రాహ్మణబ్రువాచారవిషయమని ద్యోతనార్థమై "దేవతానాంచపూజనం"అని వ్రాయుటకుఁ గారణమయినది. కావునఁ బంచాయతనపూజ యొకానొకఋషిమతముగాని సర్వజనాదరణీయము కాదని యాచరింపనివారికిఁ బ్రత్యవాయములేనట్లె యాచరించినవారికిఁ బ్రాప్తవ్యార్థమును లేదు. పరాశరులవారు కలియుగమున నిట్టియవైదికాచారప్రవృత్తి బహుళమగునని ఋషులకుఁదెలుపుటకై "దేవతానాంచపూజనం" అనివ్రాసినారు.

శాస్త్రిగారు రెండవశ్లోకమునందు మరల దేవతాశబ్దప్రయోగము చేయుటనుగూర్చి విచారింపవలసియున్నదని పెద్దప్రయత్నము చేసి తుదకు బూరుగుపువ్వుయొక్క గొప్ప యాకారమునుజూచి ఫలా

పేక్షితమైన చిలుక సామ్యమును శ్రోతలకుఁ గలుగఁజేసిరి ద్వితీయ శ్లోకమునందు మరల దేవతాశబ్దముఁ బ్రయోగించుట పాంచరాత్రపాశుపతాది షడ్దర్శనములఁబట్టిచూడ విష్ణుశంకరాదిదేవతాభేదము సత్యమేయని తెలుపుటకుఁగాని శ్రుతిసమ్మతమని తెలుపుటకుఁ గాదఁట. ఈ యర్థము మూలమువలననే వచ్చెనా? లేక మాధవాచార్యుల వ్యాఖ్యానమునుండియా? మఱియొక వ్యాఖ్యానమునుండియా? యని బుద్ధిమంతులు విచారింపవలెను. అందుమూలశ్లోకమునఁ బాదమ్మగర్థబోధకమగుపదమొక్కటేని లేకుంటచేమూలమునుండివచ్చెనని చెప్పుటకువీలు లేదు. మాధవాచార్యులవారు "సర్వేధర్మాః కృతేజాతాః" మొదలగువాక్యములచే కృతయుగమందు సర్వధర్మములుంబుట్టి కలియుగమందు నశించినవి గాన బ్రాహ్మణాదిచతుర్వర్ణజనులకును సమానమైనధర్మమును స్వల్పముగఁజెప్పుఁ"డని వ్యాసాదులడిగినప్రశ్నకు శ్లో॥ చతుర్ణామపివర్ణానామాచారో ధర్మపాలకః। ఆచారభ్రష్టదేహానాం భవేద్ధర్మఃపరాఙ్ముఖః॥ అనుశ్లోకముచేతఁ జతుర్వర్ణజనులకుఁ దత్తద్వర్ణోక్తమగునాచారము దత్తద్ధర్మములఁ బరిపాలించుననియు, నట్టియాచారములేనివారి యితరధర్మములన్నియు వ్యర్థములనియుఁ, జెప్పుచు నాచారమనునది నలుగురికి సమానధర్మమని పరాశరులవారు సమాధానముచెప్పి తదుపరి కేవలబ్రాహ్మణులకేచెప్పిన "షట్కర్మాభిరతోనిత్యం"అనుశ్లోకమందలి ధర్మములనాచరించుబ్రాహ్మణుఁడు చెడిపోఁడనుదానికి యజనాధ్యయనదానములు బ్రాహ్మణాదివర్ణత్రయమువారికిని సమానములను నభిప్రాయము బుద్ధియందుంచుకొని వర్ణత్రయసాధారణధర్మములంగనఁబఱచిరని "సంధ్యాస్నానం" మనుశ్లోకమునకుఁ దాత్పర్యమువ్రాసియున్నారు. కావున మాధవవ్యాఖ్యానమువలనఁగూడ నాయర్థము రానేరదు. శాస్త్రిగారుచెప్పినరీతి విష్ణుశంకరాదిభేదము పాంచరాత్రాద్యాగమకానుసారము సత్యమని తెలుపుటకుఁ గాదని మాధవవ్యాఖ్య బోధింపదు. పరాశరస్మృతికి మఱియొకవ్యాఖ్యయుండుట యింతవఱకు శ్రవణగోచరముకాదు. కావున నట్లుచెప్పుటకును వీ

లు లేదు. ఇట్టిచో రెండవశ్లోకములోని దేవతాశబ్ద ప్రయోగమువలనఁ గామశాస్త్రిగారు చెప్పిన యర్థ మెట్లువచ్చునో బుద్ధిమంతులుఁ బాగుగా బరిశీలింపవలసియున్నది. స్మృతులయందుఁ జెప్పబడినను దేవతాభేదము వేదవిరుద్ధములగు పాంచరాత్రాద్యాగమములందుఁ జెప్పబడుటవలన నశాస్త్రీయమనుటకూడ యయుక్తము. విష్ణుశంకరాదిభేదము శ్రుతులయందుఁగూడఁ జెప్పబడియున్నది. అది వాస్తవమగునా, కాదా, యనునంశము ప్రకృతమందు విచారింపఁదగినదికాదు. ఇది యునుంగాక భేదవాదులమతమునం దీభేదము శ్రుతిసిద్ధమయియేయున్నయది. అద్వైతమతానుసార మీశ్రుతికర్థము చెప్పుటకు వీలులేదు. ధర్మనిరూపకమైన గ్రంథమందు ద్వైతాద్వైతవిచార మప్రకృతము. ఇదియునుంగాక "సంధ్యాస్నాన" మను శ్లోకమునకుఁ బూర్వమందు విష్ణుశంకరాదిభేదము శ్రుతిప్రతిపాదితమా? పాంచరాత్రాద్యాగమప్రతిపాదితమా? అనువిషయమును గుఱించి యెవరును బ్రశ్న చేసియుండలేదు. అట్టిప్రశ్నయున్న యెడల శాస్త్రిగారి యర్థమెట్లులైన సిద్ధించును. గావున నప్రశస్తమగు భేదవిషయమయియే సంధ్యాస్నానమను శ్లోకమందలి దేవతాశబ్దగ్రహణమని యెట్లు చెప్పవచ్చును? శ్లో॥ "ఆదిత్యమంబికాంవిష్ణుంగణనాథంమహేశ్వరం"॥ అనుశ్లోకమందలి పూజాక్రమము పాంచరాత్రాద్యాగమములయందుఁగాని, వేదములయందుగాని, చెప్పఁబడలేదని వ్రాయుటకూడవ్యర్థమై ప్రతిమార్చనామాత్రమందె ద్వేషముగలవారికిఁ బాంచరాత్రాద్యాగమములయందుఁ జెప్పఁబడిన విష్ణ్వాదిపూజాక్రమముకూడఁ బ్రాణహారియగును. అందువలన నాగమములయందుఁ బంచదేవతాపూజలేదని చెప్పుట వారి కేమియు నుపయోగికారికాదు. ఇదిగాక "ఆదిత్యమంబికాంవిష్ణుం"అనుశ్లోకము స్వగృహ్యోక్తప్రకారము సంస్కారములఁబొందిన స్మార్తులవిషయమును పాంచరాత్రాద్యాగమములు తత్తదాగమోక్తప్రకారము దీక్షనుబొందిన వైష్ణవాదులవిషయములును, గావున నాయాగమములందాదిత్యాది శ్లోకోక్త పంచదేవతాపూజ చెప్పఁబడలేదని తెలిసికొన

వలయును. ఈ ద్వివిధదీక్షా క్రమభేదముచేనైన పూజాక్రమభేదము నూతనసంహితాదులయందుఁ జెప్పఁబడియున్నది. వేదమందును బ్రతీకోపాసన మనేకవిధములఁజెప్పఁబడియున్నది. దేవపూజ కుంభీపాకమువలన వచ్చినట్టియు, గౌతమశాపదగ్ధమైనట్టియు, బ్రాహ్మణబ్రువులకే యని తెలియుటకొఱకుఁ బరాశరులవారుఁ దేవతానాంచపూజనమని వ్రాసిరనుటకూడ దురుక్తియే. ప్రకరణమునుబట్టియు, నుపబృంహకములగు ప్రమాణాంతరములంబట్టియు, నాశ్లోకపువ్యాఖ్యానముంబట్టియు,నది బ్రాహ్మణబ్రువుల విషయముకాదు. బ్రాహ్మణబ్రువలక్షణము ముందుప్రకరణాంతరమందుఁ జెప్పఁబడఁగలదు. సంధ్యాస్నానమనుశ్లోకములోని దేవతాపూజ బ్రాహ్మణబ్రువులకని యుపబృంహకవాక్యములు కనఁబడవు. నాకుఁ గనఁబడకపోయినను స్వోక్తార్థమున కుపయోగముగా శాస్త్రిగారిచేతనైన నట్టియుపబృంహక ప్రమాణాంతరము లుదాహరింపఁబడి యుండినవికావు. వర్ణత్రయసాధారణధర్మములఁజెప్పుచున్నాఁడనని సంధ్యాస్నానమనుశ్లోకమునకు మాధవాచార్యులవారు తాత్పర్యము చెప్పినటుల నిదివఱకే వ్రాసియున్నవాఁడ. కావున నేవిధమునఁజూచినను బరాశరులవారియభిప్రాయము దేవతాపూజ బ్రాహ్మణబ్రువవిషయమని చెప్పుటకు వీలులేదు. సంధ్యాస్నానమనుశ్లోకమందలి కర్మలన్నియు బ్రాహ్మణబ్రువునివేనా? లేక యొకదేవతాపూజయేనా? అన్నియు నైనయెడల నొకదేవతాపూజనే యెత్తి బ్రాహ్మణబ్రువునిదని చెప్పుట యనుచితము. ముందు చెప్పఁబోవు బ్రాహ్మణబ్రువలక్షణమునకు విరోధముకూడ, అదియొకటేయైనయెడల వర్ణత్రయసాధారణధర్మములమధ్య బ్రాహ్మణబ్రువధర్మమును జెప్పుట యర్ధజరతీయన్యాయతుల్య మయ్యెడిని. "ఒక శూద్రుని భార్య కూర యేదేని తెమ్మని బాధింపఁగా నింటనున్న యాడకోడిని దఱిగి వండుమని చెప్పినంతలోఁ బిల్లలపెట్ట నెట్లుచంపుదునని భార్యయడిగినఁబిల్లలను బెట్టు వెనుకభాగమునుంచి ముందుభాగమును వండుమని చెప్పెనఁట" దీని నర్ధజరతీయన్యాయమనియందురు. అది యెట్లుసంభవింపదో నితరధర్మప్రకరణమున బ్రాహ్మణబ్రువధర్మము చెప్పుటయు నట్లేసంభవింపదు.



## సూతసంహిత.

## ద్వితీయాశ్వాసము.



### —జ్ఞానయోగఖండము—

#### జ్ఞానయోగ సంప్రదాయ పరంపర—

క॥ శ్రీకరసత్కోటిలగాని, కులాకరమణికోటయాభిధార్చితచరణా!
లోకావనకరకరుణా!, నాకాధిపవినుత! దక్షిణామూర్తి! శివా!॥ 1

వ॥ అవధరింపుము, జ్ఞానయోగఖండమాహాత్మ్యం బెట్టిదనిన॥ 2

శా॥ నానారత్నప్రదీపవిస్ఫుటము నానావృక్షసంకీర్ణముఀ
నానాధారణయోగిసేవ్యమును నానాతీర్థసంవాసముఀ
నానాదివ్యమునిప్రకాండమును నానాదేశసంయుక్తమై
తానొప్పారెడు వెండికొండపయి నాత్మానందముఀ జెందుచుఀ॥ 3

సీ॥ శ్రీమత్సుఖాసనాసీనుఁడై తన తేజ
మున లోకములు ప్రభాస్ఫురితములుగ
సర్వశాస్త్రార్థవిజ్ఞానియు వేదవే
దాంగపారగుఁడు సర్వాంగభస్మ
ధారియు రుద్రాక్షధారణుండు త్రిపుండ్ర
మస్తకుండును జటామకుటయుతుఁడు
జగదేకగురుఁడు విషయవిదూరుండు జీ
వన్ముక్తుఁ డాగమవర్త్మగతుఁడు

వ్యాసకృపచేత వ్యాసునివలెను విగత
మోహుఁడును నాసికాగ్రసమున్నతోరు
దృష్టియుతుఁడై చూఁ దనుదాన నిష్ఠతోడ
ధ్యానమొనరించుసూతు విజ్ఞానమహితు॥ 4

వ॥ కనుంగొను వేడుక విష్ణువృద్ధ విశాలాక్ష వత్సకుంఠిత జాబాలి జమదగ్ని జర్జర జంగమ జయదక్ష పాకరదరపాకసరాగ పండితోత్తమ మహాకాయ మహాగ్రీవ మహాబాహు మహోదరోద్దాలక మహాసేనాత్మామలక ప్రియైకపాద ద్విపాద త్రిపాద పాదనాశ కోగ్రవీర్య మహావీర్యా నుత్తమోత్తమ పరవందిత కరుణకాలకైవల్య కలాపధర కల్పాంతకంకణ కాలకాలాగ్నిరుద్ర శ్వేతబాహు మహాప్రాజ్ఞ శ్వేతాశ్వతరు లాదిగాఁగల మహామునులు శిష్యప్రశిష్యులతోడం గూడి పాశవిచ్ఛేదనేచ్ఛ వేదార్థంబులు విచారించి విషణ్ణులై వివశులై కలధౌతశిఖరిశిఖరాగ్రంబుఁ జేరి యం దేకాగ్రచిత్తంబున నాసాగ్రాలోకనజాగ్రత్ప్రజ్ఞవిజ్ఞానసమాధినమేతు సూతుఁ గాంచి తత్ప్రాంతంబున విస్మితస్వాంతులై కొంతతడవునిలిచి యంత 5

క॥ అణుకువతో సాష్టాంగ
ప్రణతులుగావించి భక్తిపరవశులగుచుఁ
గణనకుమీఱినసుతులను
గణుతించిరిసూతు విగతకలుషవ్రాతుఁ॥ 6

వ॥ "దేవా! నీవు సాక్షాద్విష్ణుండవు, కృష్ణద్వైపాయనువలన నవాప్తప్రజ్ఞానయోగుండవు,మున్ను నీవలన సంక్షేపప్రకారంబుగా సర్వంబువింటిమి, ఇప్పుడు జ్ఞానయోగంబు సహేతుకంబుగా వినవలయుం జెప్పవే" యనిన నమ్మహాత్ముండు సమాధిచాలించి 7

సీ॥ సర్వేశ్వరుండును సాంబుండు సంసార
చటులామయోరుభేషజుఁడు శివుఁడు
శరదిందుకాంతి యాజానుబాహాచతు

షట్కం డుం మూళిధృతవదీక్షుముదహింతుండు
వ్యాఘ్రచర్మాంబరవసనుండు నీలకం
ఠుండు కపర్దయుతుండు విభుండు
వ్యాఖ్యానదేవుండు వరదక్షిణామూర్తి
విగ్రహుండును మహానుగ్రహుండు
నైన పరమేశు హరు నిత్యు నాత్మఁ దలఁచి
తనదుగురుమూర్తి వ్యాసుని దలఁచి మ్రొక్కి
చెప్పదొడఁగెను సన్ముని శ్రేణికపుడు
మృదులమధురోక్తి వేదాంతహృదయమెల్ల॥ 8

తే॥ "మున్ను గిరిజాత శివునకు మ్రొక్కి భక్తి
నడిగెనీప్రశ్న దీనినయ్యగజవినఁగ
దేవగురునకుఁ దెల్పె నద్దేవదేవుఁ
డిట్టి వేదాంతసార మెందేనిగలదె॥ 9

ఆ॥ అగజవలన స్కందుఁ డతనివలన వసి
ష్ఠముని యతనివలన శక్తి యతని
చేఁ బరాశరుండుఁ జెందె నాతనిచేత
వ్యాసుఁడొందె నమ్మహాత్ముకరుణ॥ 10

వ॥ జన్మాంతరతపోబలంబున నేనభ్యసించితి నదియు మీరు చే
వినినయట్లు వచించెద, సావధానచిత్తంబున వినుం"డని యానతిచ్చి
యిట్లనియె॥ 11

## ఆత్మచేతఁ గలిగిన సృష్టి.

మ॥ "శివుఁ డాదేవగురుంగనుంగొనివచించెఁ "దేవ మంత్రీశ్వరా!
భవదుఃఖచ్ఛిద మాత్మవేద్యము పరబ్రహ్మైక్యసంధాన మ
ష్టవిధా గావృతమైన జ్ఞానము రహస్యంబాటఁ జెప్పంగ రా
దు, విశేషించి కృపాబలంబున వచింతుఁ మీకు బోధార్థమై॥ 12

వ॥ తమోమాత్రంబై నజగంబు మద్భిన్నంబు, మంచువలెఁ దోఁచుచుండు, నదెట్లనిన, పరశివునివలన సర్వగుణంబైన మహ త్తత్త్వంబు జనించె, తానొక్కండైన శివుండె సృష్టిస్థితిలయార్థంబు రజస్సత్త్వతమోగుణావలంబియై బ్రహ్మవిష్ణురుద్రరూపంబులు ధరియించె, వారలమూర్తులు గుణవైషమ్యంబున నుత్తమాధమరూపంబుల వేఱువేఱ నసంఖ్యంబుగాజనించె, అవ్యక్తంబువలనఁ గాలపాకంబుచేత వేఱువేఱఁ బంచవింశతితత్త్వంబులుజనియించె, కాలంబు మాయాత్మసంబంధంబై సర్వసాధారణంబైయుండు, సర్వంబును గాలపరాధీనంబు, కాలంబెవ్వరివశంబుకాదు, మొదలఁ బురుషుండును భగవంతుండును హిరణ్యగర్భుండు నగు ప్రజాపతి జనించె, అతండు శివప్రసాదంబువలన స్థావరజంగమాత్మకంబైన జగంబును వర్ణాశ్రమాచారాదులుం బుట్టించె, శివప్రసాదంబునంగాదె దేవమనుష్యాదిలోకంబులుజన్మించుట, అద్దేవు ప్రసాదంబువలన బ్రహ్మవిష్ణురుద్రు లాత్మపదంబులుంగాంచిరి. వర్ణాశ్రమాచారరతులచే సేవ్యుండగు శివుండు దుర్వృత్తుల కగోచరుండగు, అద్దేవుండు ప్రసన్నుండైన భుక్తిముక్తు లయత్నంబునఁగలుగు, అది మాయావశంబగు లోకం బెఱుంగదు. చతురాశ్రమనిష్ఠులచే నుపాస్యుండగు మహేశ్వరుండు వర్ణాశ్రమాచారధర్మంబునం బ్రసన్నుండయ్యెనేని శీఘ్రంబుగా బ్రహ్మవిజ్ఞానంబుజనించు, జ్ఞానంబున నజ్ఞానధ్వంసంబైనంతనే ముక్తిగలుగు, కర్మంబునఁ గలుగనేరదు. సర్వంబును సంక్షేపంబుగా నెఱింగించితి, వాచస్పతీ! నీవును వర్ణాశ్రమాచారరతుండవుగ"మ్మనిన నెమ్మదిహర్షించి బృహస్పతి ప్రసాదార్థంబు స్తోత్రంబుఁజేయంబూనె నెంతయు॥ 13

దండకం॥ "నమో దేవదేవాయ మాయావినే శూలినే తాపసేంద్రాయ సంవిత్ప్రదాయాతిశుద్ధాయ బుద్ధాయ కారుణ్యరూపాయ వేదాంతవేద్యాయ తే కాలకాలాయ పాషండభంగాయ పాపప్రణా

శాయ ప్రాణస్వరూపాయ యోగాయ యోగీశ్వరాయాతిపూజ్యాయ రుద్రాయ విశ్వాత్మనే విశ్వరూపాయ తుభ్యం మహాధారచక్రప్రతిష్ఠాయ సన్నాభికందప్రతిష్ఠాయా హృద్దేశసంవాసినే సచ్చిదానందరూపాయ సాక్షాత్పరాయాత్మరూపాయ శ్రీమచ్ఛివాయాఖిలేశాయ మోక్షస్వరూపాయ నిత్యం నమస్తే నమస్తే నమః". 14

మ॥ అని దేవేంద్రగురుండు శంకరుని విద్యాదాయి సేవించి చే
సిన దివ్యస్తుతి యెవ్వఁడేనిఁ జదువన్ శీఘ్రంబ కల్యాణమో
క్ష నవాత్యభ్యుదయంబు నొందు నిఁక శశ్వద్భక్తి మీరున్ మహా
మునులారా! పఠియింపుఁ డీశ్వరుకృపన్ మోక్షంబు ప్రాపించెడిన్॥

బ్రహ్మచర్యాశ్రమవిధి.

తే॥ దేవగురునకుఁ దెల్పె నద్దేవదేవుఁ
డాగమాంతైకసంసిద్ధమైనయట్టి
యాశ్రమాచారవిధి కృపాయత్తుఁడగుచు
నందు బ్రహ్మచర్యాశ్రమం బమర వినుఁడు॥ 16

వ॥ ద్విజుం డుపనీతుండై వేదాధ్యయనంబు చేసి దండయజ్ఞోపవీతమేఖలాజినకాషాయశుక్లవస్త్రాదులు ధరియించి భిక్షాహారతుండై గురుశుశ్రూషాపరుండై కేశాంతప్రమాణంబుగా నవ్రణత్వగ్విభూషితపాలాశాశ్వత్థాదిదండధారియై సాయంప్రాతస్సంధ్యావందనం బాచరించుచుఁ గామక్రోధలోభమోహారహితుండై స్వసూత్రవిధి సాయంప్రాతరౌపాసనంబు సేయుచు దేవర్షిపితృతర్పణంబులు సేయుచు సమిదాగ్నిజంబును విరజానలజంబును నయిన భస్మంబు సజలంబుగా నగ్నిరిత్యాదిమంత్రంబులఁ గ్రమంబుగా నంగంబుల నుద్ధూళనంబు గావించి తిర్యక్పుండ్రంబులు వక్షోలలాటకంఠకర్ణంబుల శుచియై యుమామహేశ్వరుల ధ్యానంబు చేసి మేధావిత్యాదిమంత్రంబులనైనఁ "త్ర్యాయుషంజమదగ్ని"రిత్యాదిమంత్రంబులనైన ధరియించి పుష్పపత్రంబుల శివుం బూజించి మాతృపితృజ్యేష్ఠవృద్ధగుర్వాధ్యాత్మజ్ఞానుల కభివాదనంబు సేయుచు

మాతాపితృవంశ్యుల గుణాధికుల మనోవాక్కాయంబుల నభినందింపు
చు "ఆయుష్మాన్భవ" యను విప్రాశీర్వచనంబులు గైకొనుచు సవ్యద
క్షిణంబుల సవ్యదక్షిణస్పృష్టిగలుగ వ్యత్యస్తపాణిచేత గురున కుపసం
గ్రహణంబుసేయుచు లౌకికవైదికవాక్యంబుల నధ్యాత్మజ్ఞానం బుపదేశిం
చుగురున కభివాదనంబుసేయుచు గురునిజూచునంతట లేచి కృతాంజలి
యై తదాజ్ఞ నాసీనుండగుచు సత్యంబెపలుకుచు నభ్యస్తవిద్య మఱవక
నిత్యనైమిత్తికంబులు మోక్షకామంబుననైన విధ్యుక్తంబనియైన శాం
తుండై యాచరింపుచు భిక్షాన్నంబు గురు నివేదనంబుసేసి భక్షింపుచు
నందు బ్రహ్మక్షత్రవైశ్యుల భవచ్ఛబ్దంబు నాదిమధ్యాంతంబులనుంచి
భైక్షింపుచు భిక్ష సమృద్ధంబైనం జాలించి ప్రాఙ్ముఖంబుగానైన సూ
ర్యాభిముఖంబుగానైన కూర్చుండి కరపదప్రక్షాళనంబుగావించి ద్విరా
చమనంబు చేసి ప్రాణాహుతులొనర్చి భుజింపవలయు, వేదాభ్యాసంబు
దక్క నితరమంత్రంబులుచాలించి యివ్విధంబున నభ్యసింప వైరాగ్యం
బుజనించెనేని పరమహంసాశ్రమం బవలంబింపవలయు, కామియైన గృ
హస్థుండైకావలయు, నెంతయు 17

గృహస్థాశ్రమవిధి

తే॥ ఇంక గార్హస్థ్యధర్మంబు లేర్పరింతు
వినుబృహస్పతి! వేదాదివిద్యలెల్లఁ
జదివిగురునాజ్ఞ గృహిగాగ సత్కులంబు
వెదకి ప్రవరగోత్రాదులు గదియకుండ॥ 18

తే॥ సర్వలక్షణయుక్తయు సాధ్వియైన
కన్యవరియింపఁదగును వృక్షోపగాఖ్య
తైనకాంతలవిడచి ధర్మ్యక్రమునను
గృహి జితేంద్రియవృత్తిమై కేవలముగ॥ 19

సీ॥ ఋతుకాలమునఁ దనసతితోఁ బుత్రక
స్థితికితోడఁగూడుచు దేవతాఖ్య

తిథిసుభిక్షార్థమై ధృతిఁ జేయఁగాఁదగుఁ
బాకంబు లాత్మార్థపరతఁ జేయ
నరకంబువాటిల్లు,ధరణిజీవించుట
ధర్మంబునకును సంతానమునకు
సురతంబుగల్గు నాపురుషుండు ముక్తుఁడౌ
నన్యుఁ లు నారకులగుటనిజము

యాజనాధ్యాపనాదుల నతివిశుద్ధ
జనులవలనను ధనములు సంగ్రహించి
యజ్ఞయాగాదిసత్క్రియ లాచరింప
ధర్మమందురుగృహికిని దత్త్వవిదులు॥ 20

వ॥ మఱియు గృహస్థుండు నిర్జనంబును నిర్భయంబునునగుదేశంబున విణ్మూత్రవిసర్జనంబునుగావించి గుదశిశ్న పాదద్వయకరద్వయంబులు మృజ్జలంబుల యథాశక్తి గంధలేపము క్రికి మనశ్శుద్ధియాదాఁక ప్రక్షాళనంబుగావించి యాచమనంబుచేసిదంతధావనంబుగావించిద్విరాచమనపూర్వకంబుగా స్నానంబుచేసి కృత్యశేషంబుగావించి ప్రాణాయామంబుచేసి గాయత్రిజపంబుచేసి యుపస్థానంబు చెప్పవలయు, మధ్యాహ్నంబునసంధ్యాదిక్రియలొనర్చి బ్రహ్మయజ్ఞవేదపారాయణాది కర్మంబు లాచరించి యంతమీఁద నగ్నికార్యబలికర్మనిత్యశ్రాద్ధాదు లాచరించి సర్వభూతదయాళుండై యశక్తరక్షణంబొనర్చి యతుల నన్నపానాదులఁ దృప్తినొందింపవలయు, యతి బ్రహ్మచారులు పక్వాన్నాధికారులగుట వారలకొసంగక భుజించినఁ జాంద్రాయణంబొనర్పవలయు, యతిహస్తార్పితంబులగు భిక్షాన్నజలంబులు మేలుసాగర తుల్యంబులగు, కుక్కుటాండప్రమాణద్వాత్రింశద్గ్రాసాశనుండై యేక వారాశియగుట మేలు, అశక్తుండైన ద్వివారభోక్తయై గురువృద్ధాగ్నుపాసనోపాసనజపాచమనభుక్తికార్యంబులు సోపవీతియైచేయుచు వేణుదండసోదకకమండలుధరుండై పూర్వోక్తవిధి భస్మోద్ధూళనంబొ

నర్చి త్ర్యంబకంబునను సప్రణవంబగు శివమంత్రంబునను త్రిపుండ్రధారణంబు సేయవలయు, శిరంబున ద్రిపుండ్రంబు ధరించునంతనె సర్వంబును శ్రుతంబును నధీతంబును ననుష్ఠితంబును నై సఫలంబునొందు, తద్ధారణంబు వేదోదితవిధమగుటఁదల్లంఘనంబునఁ బతితుండగు, శ్రుత్యుక్తవిధమగు రుద్రాక్షధారణంబొనర్చి లింగమూర్తియందు నమ్మహాదేవునర్చించి సాగ్నిహోత్రుండై యజ్ఞంబు సేయవలయు, యజ్ఞంబుచే సర్వపాపక్షయంబై శివజ్ఞానాపేక్షజనించు, లేక స్వర్గాదిభోగకాముండైన స్వర్గసుఖంబనుభవించు, పితౄణశాంతికై భార్యయందుఁ బుత్రులనుత్పాదించి సత్యప్రియవచనుండై వర్తింప నంతవిరాగంబొదవిన సన్యసించి వేదాంతాభ్యాసం చేయవలయు, సన్యాసి వేదాంతాభ్యాసంబు చేయకుండినఁ బతితుండగు, విరక్తుండయ్యును మోక్షాధికారికాకుండిన బహూదక కుటీచక హంసాశ్రమంబుల స్వాధికారంబుకొలఁది సన్యసింపవలయు, అవిరక్తుండయిన వానప్రస్థుండుకావలయు లేకున్న యావదాయుష్యంబుగృహియగుట మేలు, గృహస్థాశ్రమంబువలన సకలాశ్రమంబులు సంరక్షితంబులగుట నవిరక్తుండు గృహస్థాశ్రమంబుదక్క సన్యాశ్రమంబుల నంగీకరింపఁదగ' దనిమఱియు నిట్లనియె॥ 21



వానప్రస్థాశ్రమవిధి.

తే॥ "వినుబృహస్పతి! వనవాసవిధమునీకుఁ
దెలియఁజెప్పెద నిగమోక్తిపలుకునట్లు
వనికిఁజనఁదగుఁ దనభార్యఁ దనయునొద్ద
నునిచియైనను దనతోడఁ గొనుచునైన॥ 22

మ॥ శుభవారర్క్షముహూర్తకాలములఁదా సూర్యుం డుదీచీదిశన్
బ్రభవింపందగు శుక్లపక్షమున నావాసంబుగావించి యం
దభయుండై ఫలమూలశాఖములచే నన్నంబుచేనైనఁ గు
క్షిఁ భరింపందగు షోడశగ్రసనుడై శిష్టానుచారంబునన్॥ 23

సీ॥ కృచ్ఛ్రచాంద్రాయణక్రియలాచరింపుచుఁ
దగ నఖరోమకృంతనము మాని
వేదంబుఁ జదువుచు విహితాగ్నిహోత్రియై
పంచయజ్ఞంబు లేర్పడఁగఁ జేసి
జటిలుఁడై చీరవాసస్కుఁడై త్రిషవణ
స్నానియై సర్వభూతానుకంపి
యై యేకవారాశియై రాత్రి ధ్యానంబు
సేయుచుఁ గామాదిచేష్టలణఁచి
భూమి శయనించి పంచాగ్నిధామమధ్య
మునను వర్షవాతాదులందునను నిలిచి
తపము సేయుచు సావిత్రిజప మొనర్ప
వలయు మధుమాంసవర్జియై వననివాసి॥ 24

తే॥ అంతకంతకుఁ దపము దా నధికముగను
గ్రోధహైశున్యనిద్రాది గుణము వెడలి
దైవపితృతర్పణంబులు తగనొనర్చి
పవనభక్షకుఁడై యేకపాదమునను॥ 25

ఆ॥ నిలిచి ఘోరతపము నియతుఁడై సేయుచుఁ
బాలుగొనుచు శుక్లపక్ష మసిత
పక్షమందు నిష్ఠ పరఁగంగ గోమయం
బమరఁగొనుచు నాకు లశనముగను॥ 26

వ॥ అంతఁ గృష్ణాజినోత్తరీయుండును శుక్లయజ్ఞోపవీతియు నై యగ్ని నాత్మారోపణంబు సేసి యోగాభ్యాసరతుండై గృహస్థోక్తవిధిఁ ద్రిపుండ్రోద్ధూళనపరుండై పరమేశ్వరధ్యానతత్పరుండగుచు నేకాకియు, ననికేతనుండును, ముముక్షుండును నై యంతట వైరాగ్యంబుదయించినఁ గుటీచక బహూదక హంస పరమహంసాదులం దొక్కయాశ్రమం బాశ్రయింప వలయు, బృహస్పతీ! సర్వంబును సంగ్రహారూ

పంబుగా నీ కెఱింగించితి, శ్రద్ధాళుండవై గ్రహింపు"మని మఱియు
నిట్లనియె॥ 27


సన్యాసవిధి

తే॥ "ఇంక సన్యాసవర్తనమెల్లనీకుఁ
దెలియఁజెప్పెద వాచస్పతీ! కుటీచ
కాదినామంబులను నాలు గలరు ధరణి
వానిభేదంబులన్నియు వరుసవినుము॥ 28

సీ॥ మహితకాషాయకమండలుండు త్రిదండి
వెసశిఖాయజ్ఞోపవీతధారి
తనయింటనైన బాంధవగృహంబులనైన
నశనంబుగొనుచు గాయత్రిజపము
భస్మధారణమును భవునర్చనముగల్గి
సపవిత్రుఁడగుఁ గుటీచకుఁడు దలఁప
అల బహూదకుఁడు పుత్రాదివర్జితుఁడౌచు
సప్తదేశ్మల భిక్ష జరుపుకొనుచుఁ
బరఁగ గోవాలరజ్జుసంబంధమైన
యొకత్రిదండంబు యోగపట్టికయు సూచి
అక్షసూత్రంబు పత్త్రిణి యాజిన మమల
ఛత్ర కౌపీన బాహ్యావస్త్రములు దాల్చి॥ 29

తే॥ పాత్రజలపవిత్రంబును బాదుకలును
మృద్ఖనిత్రంబు నసియును మేధ్యమగు క
మండలంబును శిక్యం బఖండనియతిఁ
దాల్చి భస్మత్రిపుండ్రాది ధారియగుచు॥ 30

వ॥ మఱియు, శిఖా యజ్ఞోపవీత దేవతారాధన స్వాధ్యాయం
బులు విడిచి సంధ్యాకాలంబున సావిత్రీజపకర్మంబు లాచరింపుచు,
ధ్యానైకనిరతుండుగావలయు, ఇంక హంసుండు బ్రహ్మచర్య శుచిత్వం

బులు గలిగి కమండలశిక్య భిక్షాపాత్ర కంథా కౌపీనాచ్ఛాదనా ద్యంగవస్త్ర బహిఃపటలంబులును, వేణుదండంబును, ధరియించి త్రిపుండ్రోద్ధూళనపరుండై శివలింగార్చనంబుసేయుచు శిఖాయజ్ఞోపవీతరహితుండయి సంధ్యాకాలంబుల సావిత్రీ జపించుచు సధ్యాత్మచింతనపరుండై యమ నియమ కృచ్ఛ్ర చాంద్రాయణ తీర్థసేవాదు లొనర్చుచు గ్రామైకరాత్రంబుగా న్యాయంబునఁ జరింపవలయు, పరమహంసుండును గోవాలనిర్మితరజ్జు త్రిదండ శిక్య పవిత్ర కమండలు పక్షి వ్యాజీన సూచీ మృద్ఘనిత్ర కృపాణి శిఖోపవీత నిత్యకర్మంబులువర్జించి యాచ్ఛాదన మాత్రంబు కౌపీనంబు, శీతనివారణార్థంబు కంథయును, యోగపట్టా బహిర్వస్త్ర పాదుకా ఛత్రాక్షమాలికా వేణుదండంబులు ధరియించి మౌనియై యగ్నిరిత్యాదిమంత్రంబుల భస్మోద్ధూళనంబుసేసి యోంకార హంసమంత్రంబులఁ ద్రిపుండ్రంబుధరియించి మృత్కాంస్య వేణు దారు పాత్రంబులలో నొకటి ధరియింపవలయు, బహూదకహంసులు కాంస్యపాత్ర ధరియింపఁదగదు. పరమహంస మధుకరాన్నరటులు యోగానుగుణ్యంబుగా గ్రసింపుచు మృత్పాత్రధారియై సార్వవర్ణిక భిక్షాపరుండగుచు నుత్తరోత్తరలాభంబునఁ బూర్వార్జితంబులు వర్జించి గురుశుశ్రూషచే నాత్మజ్ఞానం బభ్యసింపుచు స్నాన, శౌచ, ధ్యాన, సత్యానృత కామ క్రోధ హర్ష శోక లోభ మోహ దంభ దర్పంబులు వర్జింపవలయు, చాతుర్మాస్య లందటికిం గలిగియుండు, కుటీచక బహూదక హంసులు మోక్షహేతువగు సావిత్రి జపింపవలయు, పరమహంసుండు సర్వవేదమూలంబును సర్వవేదమయంబును నగు ప్రణవంబు జపింపవలయు, సంధ్యాకాలంబున శుద్ధాత్ముండయి ప్రణవంబునఁ బ్రాణాయామత్రయంబుసేసి యష్టోత్తరశతంబు జపంబుసేసి వియుక్తస్థలంబున సుఖాసీనుండై యథాశక్తి సమాధినిష్ఠుండు కావలయు, జ్ఞానంబు వొడమెనేని క్రమంబునఁగాని యక్రమంబునగాని యుత్తమవృత్తినాశ్రయింపవలయు, ఉత్తమవృత్తిస్థితుండునీచవృత్తినవలంబిం

చిన నారూఢపతితుండై సర్వకర్మబహిష్కృతుండగు, ప్రవ్రాజితుండగు శిష్యునిజూచి సూర్యుండు తనమండలంబుభేదించి బ్రహ్మలోకంబునకరుగునని చలింపుచుండు, చరదైవతంబు సన్యాసియు నచరదైవతంబు మృణ్మయాదికంబు నగు, ఎవ్వనియాశ్రమంబున సన్యాసి నిత్యంబు వసియించు నతనికి మూడులోకంబుల దుర్లభంబు లేదు, దుర్వృత్తుండైనను సువృత్తుండైనను మూర్ఖుండైనను బండితుండైనను వేషమాత్రంబున సన్యాసి శివునింబోలి పూజ్యుండగు, బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థయతులకుం గ్రమంబుగ బ్రహ్మవిష్ణ్వాదిత్య మహేశ్వరులధిదేవతలగుదురు, అందుసన్యాసి సర్వపూజ్యుండగు, మృతుండైనపరమహంసకుదహనాశౌచోదకక్రియలు లేవు. అతండు మృతుండైన భూస్థాపనంబుసేసి యచ్చట నశ్వత్థంబునిల్పినవాఁడు మహేశ్వరత్వంబునొందు, ఆవృక్షంబును దర్శనస్పర్శనంబుల సకలపాపంబులుహరించు, ఇంకబహూదకాదుల మొదలు ఖననంబుసేసి పిదప దహనంబొనరించిన గృహస్థుం డశ్వమేధ ఫలంబునొందు. స్నానమాత్రంబున శుద్ధుండగు, బృహస్పతీ! శిష్యుండవగు నీకు వేదాంతార్థప్రకాశనంబగు నీవిధానంబు సంక్షేపంబుగాఁ జెప్పితి. నీవెఱింగి కృతార్థుండవుగ"మ్మని మఱియును పశుపతి గీష్పతి కిట్లనియె. 31

## ప్రాయశ్చిత్తము.

శా॥ "శ్రేయఃప్రాప్తికి సర్వపాపహరమై చెన్నొందు సమ్యక్కృపన్
ప్రాయశ్చిత్తములన్ వచించెద మహాపాపాళికిన్ నేను స్వే
చ్ఛాయత్నంబులు లేక చేయునఘముల్ సంహారముం జేయఁగా
ధీయుక్తిన్ బుధులైనవారికి భయోద్రేకంబుఁ బుట్టింపఁగన్॥ 32

తే॥ కాంచనస్తేయగురుతల్పగమనరతులు
బ్రహ్మహత్యాసురాపానపరులు వీరి
సంగ మొకయేడు చేసినజనుఁడు గూడఁ
బంచవిధమహాపాతకబద్ధు లరయ॥ 33

సీ॥ బ్రహ్మహత్యయొనర్చు పాతకి నిర్జన
వనములో నిల్చి కపాలకుండు
భిక్షాన్నమిడుకొని భక్షింపవలె, లేక
కందమూలాదులఁ గడుపునింపు
కొనవలె నింద్రియగుణములు వర్జించి
తన పాపమును జెప్పుకొనుచు నిట్లు
ద్వాదశాబ్దంబులు వర్తింపఁగ నకామ
కృతదోషమణఁగు గామితనొనర్పఁ
బరివెలువడి యనశనుఁడై భూరివహ్ని
సలిలముల మహాప్రస్థానసమరములను
దనువుదొఱఁగిన లేక తా ధరణిసురుల
గోవులను బ్రోవఁ జచ్చినఁ బోవునఘము॥ 34

తే॥ ఇదియ మధుపానముఖదోషమెల్ల నణఁచు
మధువుగాని ఘృతజలపయోమధ్యధేను
మూత్రములలోన నొక్కటి పొసఁగఁ గాచి
త్రాగి మృతుఁడైనఁ దద్దోషతమము వాయు॥ 35

సీ॥ స్వర్ణచోరుండు భూజానియున్నెడ కేగి
శిక్షింపుమనిన నాక్షితివరుండు
ముసలంబుగొని వాని వేసఁ జంపఁ దద్దోష
మణఁగుఁ బాపంబులేదవనిపతికి
గురుతల్పగమనుండు ఘోరతప్తాయస
వనితఁ గౌఁగిటఁ జేర్చవలయు, మఱియు
వృషణంబు శిశ్నంబు వేసఁగోసి తనదోయి
టను దాల్చి దక్షిణమునకుఁ జనఁగఁ
బ్రాణములుపోవు నప్పుడ పాపమెడలు
బ్రహ్మహాపాతకులతోడ నెవ్వఁడేని

సంగియగు వాఁడు తప్తకృచ్ఛ్రంబుచేసి
వత్సరములోనఁబాయుఁ దత్పాపమెల్ల॥ 36

తే॥ తల్లిఁ దత్సదృశలఁ బినతల్లి భాగి
నేయి గూడినవాఁడు చాంద్రాయణంబు
కృచ్ఛ్ర మతికృచ్ఛ్రమును జేయఁ గిల్బిషంబు
పాయుఁ జెల్లెలిఁ గూఁతురుఁ బట్టినతఁడు॥ 37

తే॥ తప్తకృచ్ఛ్రంబునలుపఁ దత్పాపమణఁగుఁ
దండ్రిచెల్లెలి మాతులతరుణిఁ గాను
మున సకామంబుచేనైనఁ బొందెనేని
యట్టిదరితంబు చాంద్రాయణాప్తిఁ బాయు॥ 38

తే॥ బ్రాహ్మణక్షత్రియోరువ్య పద్మముఖుల
నితరవర్ణాంగనలఁ గూడెనేని తప్త
కృచ్ఛ్ర మొనరింపఁ బాయు దుష్కృతము లెల్ల
బ్రహ్మచారి సకాముఁడై పడఁతిఁగూడి॥ 39

తే॥ గర్దభాజినమందు భైక్షంబుగొనుచుఁ
ద్రిషవణస్నాన షణ్మాసదీక్షగలిగి
స్వకృతదోషంబు దెలుపుచు జగతిదిరుగఁ
దన్మహాఘంబువాయు నుత్తమచరిత్ర॥ 40

వ॥ అగ్నికార్యత్యాగ రేతోత్సర్గంబుల సప్రణవవ్యాహృతులను శిరస్సహితగాయత్రీమంత్రంబు నయుతంబు జపించిననతనిదురితంబు వాయు ప్రణవం బయుతంబొనర్చిన యతుల కింద్రియోత్సర్గదురితంబు దొలంగు, ద్విజస్త్రీగామియైనయతి యవకీర్ణవ్రతం బొనరింపవలయు, సకాముఁడైనఁ దప్తకృచ్ఛ్రంబు చేయందగు, క్షత్రియ వైశ్య శూద్ర హత్యలొనర్చినఁ గ్రమంబుగ షణ్మాస త్రిమాసార్ధమాసంబులు బ్రహ్మహత్యాహరణవ్రతంబొనర్చిన, దద్దోషంబుదొలఁగు, విహితాకరణ నిషిద్ధసేవన గురుద్రోహాద్యఖిలకలుషంబులు తప్తకృచ్ఛ్రంబునఁబాయు

ఇట్లుగాకున్న వేదాంతోపదేశంబు సేయుగురునకు శుశ్రూష చేసిన సకలపాపసంఘంబుల కిదియ ముఖ్యప్రాయశ్చిత్తంబగు, శ్రద్ధా వినయ శాంతి దాంతి సహితుండై జ్ఞానోదయపర్యంతంబు వేదాంతశ్రవణంబు సేయందగు. ఇట్లుచేయ మాసత్రయంబున త్రివిధపాపంబులును, షణ్మాసంబుల నుపపాపంబులును వత్సరంబున మహాపాపంబులును నశించు, ఇదిసత్యము బృహస్పతీ! "యెవ్వండైన వేదాంతశ్రవణాభ్యాసంబు సేయుచుండు వాని సంసారమోహచ్ఛేదంబగు"నని శ్రుతివలుకుచుండు, పాపశాంతాదరదశానలంబగు జ్ఞానంబుదక్కఁ బాపౌఘంబునకుఁ బ్రాయశ్చిత్తంబొండు లేదు. అట్టిదిజ్ఞానముచే హీనులయిన జనులు పూర్వోక్తప్రకారంబునఁ బ్రాయశ్చిత్తంబొనర్చుకొనవలయు, మఱియును. 41

సీ॥ ధరణి యోగాభ్యాసపరునకు విఘ్నంబు
కలుగ బ్రహ్మాదిలోకములఁ గ్రమము
దొడరఁగా భోగించి పుడమి జ్ఞానైశ్వర్య
విలసితాన్వయమందు విప్రుఁడగుచు
జన్మించి సర్వలక్షణసత్యశాంతాది
కలితుఁడై ప్రాక్పుణ్యఫలమువలన
గురుమూర్తిఁ జేరి తద్వరకృపఁ దనుదానె
యపరోక్షముగఁజూచి యఖిలజనము
స్వప్నమునుబోలె మిథ్యగా సంస్మరించి
సంసృతిని బాసి ముక్తుఁడౌ సర్వయత్న
ములను వినుమీవు వేదాంతములనుభక్తి
సకలసురమౌళిశోభిత చరణకమల! ॥ 42

— దానధర్మఫలము —

మ॥ వినువాచస్పతి! దానకర్మఫలమున్ విద్యాప్రదానంబు జ్ఞా
ననిదానంబగుటన్ మహత్తరము, కన్యాగోమహీదానముల్

ఘనముల్ బ్రహ్మవిద్యాఢ్యభూసురునకుఁ బ్రీతిన్ బదన్ప్రప
న నిరూఢస్థితి బ్రహ్మలోకమున సౌఖ్యంబందు నాత్మజ్ఞుఁడై వర్ధిల్లున్॥ 43

తే॥ వైదికవిద్య భూసురవరునకొసఁగ
యతికి నన్నంబు వస్త్ర మత్యర్థి నొసఁగ
బ్రహ్మసదనంబు నొంది యపారసుఖత
మరలజన్మింపఁడాతఁ డిద్ధరణియందు॥ 44

వ॥ మఱియుఁ బ్రతిపదాద్యమావాస్యాంత పంచదశతిథులయం
దుఁ గ్రమంబుగ బ్రాహ్మణ బ్రహ్మ విష్ణు లక్ష్మీ గౌరీ సూర్య చంద్రే
శ్వర ధర్మరాజేంద్ర వాసుదేవ విష్ణు బ్రహ్మర్షి మహేశ్వర సదాశివుల
నుద్దేశించి బ్రాహ్మణభోజనంబొనర్చినఁ దత్తద్దేవతాప్రసాదంబునఁ గృ
తార్థుండగు, అందు నేకాదశి నుపవసించి ద్వాదశి బ్రాహ్మణులకు
భోజనంబిడి విష్ణునారాధింప విముక్తుండగు, బ్రాహ్మణులకు శుక్లవర్ణం
బగు గోవు దానంబు సేసిన బ్రహ్మసభాపతియగు, సాలంకృతకన్యాదా
నంబొనర్చిన శివలోకంబునొందు. ఏయేప్రకారంబుల నేయేదేవతల నా
రాధింపఁ దత్తద్దేవతలఁ బ్రాపించు, అంతంబందే యేలోకంబులు వాం
ఛించిన నాయాలోకంబులనొందు, మఱియు నాత్మజ్ఞుం డాత్మనర్చించు
నని వేదంబు వలుకు, ఎంతయుఁ గ్రిమి కీట పశు మనుష్యాదు లన్యో
న్యాధిక్యముం గాంతురు. మనుష్యులలో బ్రాహ్మణు లుత్తములు, అందు
విద్యా బుద్ధిమ ద్బ్రహ్మది త్కుటీచక బహూదక హంస పరమహంసా
దు లుత్తరోత్తరాధికారులు, అట్లు కావున నాత్మవిదులు సర్వపూజ్యులై
యుందురు. బ్రహ్మవర్చసకాములు బ్రాహ్మణుల నారోగ్యకాములుష్ణ
ధాము బలకాములు మహాబలు భూతికాములు వైశ్వానరు మేధా
కాములు సరస్వతి జ్ఞానకాములు మహాదేవు సిద్ధికాములు వినాయకు
భోగకాములు చంద్రు [illegible] కాములు శంకరు వైదుష్యకాములు
విద్వాంసుఁ బుష్టికాములు శచీపతిం గూర్చి ప్రీతౌద్యాచారశ్రద్ధాభక్తి
సమేతంబుగా భజించిన సర్వపాపవిముక్తులై తత్ఫలంబులు నొందుదు
రని వేదంబులు వలుకు, మఱియును, 45

శ్రీ సోమేశ్వరాయనమః

# స్వర్ణకారవ్యవహారము.

## ద్వితీయ భాగము.

తే॥ నరసరావ్ పేటకోర్టులో నాదు కేసు
పడి విచారణచేయఁగఁబడక మూఁడు
వత్సరంబులవఱకు కనిష్కార్యమైన
యంతరాయపరంపర నట్లయుండె॥

క॥ కడుఁబెరిఁగి ఫైలిదంవిధి। వడివడిగవిమర్శగాకవర్తిలదావా
లడిపనలుకోర్టునా। నేర్పడియెన్ గుంటూరఁ బ్రజలభాగ్యపుగరిమన్

ఆ॥ అటకుఁ డ్రాన్స్ఫరగుడు నా కేస్ విమర్శకుఁ
దీసికొనిరి కొన్ని దివసములకు
దాఖలైనయట్టి దావాలయం దెష్టొ
యేదో తేల్పఁబడక యెట్టులుండు॥ 3

క॥ రంగావఝ్ఝులహనుమ। య్యంగా కాన్యన్వయాబ్ధి కబ్జుఁడనన్ ఖ్యా
తింగనిన పుండరీకా। క్షుం గుదిరిచికొనినవాఁడఁ జూ ప్లీడరులన్॥ 4

క॥ జరిగెవిచారణ క్రమముగఁ
బఱతెంచిరి చుట్టుపట్ల బ్రాహ్మణజనముల్
గురుముఖఋషివృషభాంచిత
సురపతిసభఁబోలి కోర్టు చూడఁగనయ్యెన్॥ 5

సీ॥ బియ్యేబియల్లోనఁ బృథుకీర్తులైన కొం
దఱు జిల్లాకోర్టుప్లీడరులతోడ
హూణాంధ్రభాషల నూయాయనక వ్రాయఁ
జాలిన బలుగుమాస్తాలతోడఁ

గన్నన్న సకలకార్యాల్ తత్క్షణము సల్పఁ
బార్శ్వస్థులైయుండు బంట్లతోడఁ
దమతమవ్యవహారతత్త్వముల్ గనిపెట్టు
హాళిఁ గూర్చుండు పార్టీలతోడ
నున్నతంపువేది నున్న యతలప్పట్టు
దిండ్లకుర్చిపైని దేజమెసఁగ
హేలఁగూరుచుండి యిట్లుమున్సీఫ్ గారు
లలి సభాస్థలం బలంకరించె॥

చ॥ మతవిషయశ్రుతిస్మృతి విమర్శసమీక్షణభూరికౌతుకా
గతవివిధప్రజానికరకాంత మనంతదిగంతరాగతా
ద్భుతతరసుప్రమాణ పరిపూరితపుస్తకపేటికాసమం
చిత మగు నాఁటి తత్సభ విచిత్రతరంబయి చూడఁగాఁ దగెన్॥ 7

చ॥ వినయముమూర్తిదాల్చెనని విస్మయమందఁగఁ బ్రేక్షకాళి మె
ల్లనఁ దనహస్తమందలికలానఁ జెవిం గయిసేసి తీసిపై
ల్లెను మునసీఫుముందరను దివి నొకించుక లేచి బెంచిక్లా
ర్కనుపమ మస్మదీయమగు నావ్యవహారపుఁ గాకితంబుఁ గన్॥ 8

సీ॥ విద్యార్థులకుఁ దర్క వేదాంతశాస్త్రంబు
లెడఁద కెక్కెడిరీతి నుడివికొనుచు
విద్వద్గణంబుతో వేడుకలిగురొత్త
హేలాగతిన్ ముచ్చటించుకొనుచు
న్యాయవాదులతోడ నానాప్రకారపుం
జిత్రసంభాషణ చేసికొనుచు
బ్రాహ్మణాదిజనంబు భక్తినర్పించెడి
యభివందనంబుల నందికొనుచు
గాడరుద్రాక్ష లలరింపఁ గంఠసీమ
సాలుపైఁగప్పి బ్రహ్మతేజంబుతోడ

రహినిజనుదెంచి * మల్లాది రామకృష్ణ
శాస్త్రియజ్వయె ప్రథమంపుసాక్షియయ్యె॥ 9

---

... The 24th day of August 1911.

... * My name is మల్లాది రామకృష్ణసోమయాజులుగారు father's name లక్ష్మీనారాయణగారు Age 46 years. Caste బ్రాహ్మణులు Profession వ్యవసాయం Residence అమరావతి. దేవాలయములలో ప్రాణప్రతిష్ట వగైరా కర్మలు జరుపుట కధికారము బ్రాహ్మణులకువున్నది. దీనివిషయమై మనుస్మృతి, యాజ్ఞ, వల్క్యస్మృతి పరాశరమాధవీయము నిర్ణయసింధు వగైరా పుస్తకములలో చెప్పబడియున్నది. ప్రాణప్రతిష్టఅనగా విగ్రహములు తనకు పూజకు పనికివచ్చేటట్టు యితరహిందూజాతులవారికందరికి పనికివచ్చేలాగు ప్రతిష్టచేయుట అని నాఅర్థము. మనుస్మృతి 10వ అధ్యాయము 75 శ్లోకము మొదలు 97 శ్లోకములవరకు యీవిషయమై చెప్పబడియున్నది. 1 యీమనుస్మృతిలో నేనుపైనచెప్పిన అధ్యాయములోని శ్లోకములలో 76,77,95,96 to 97 శ్లోకములు ముఖ్యమైనవి. ప్రతిష్టకర్మ యాజనములో చేరుతుంది. బ్రాహ్మణికివున్న 6 కర్మలలో యాజనకర్మవున్నది. 77వ శ్లోకములో క్షత్రియులకు సహితము యాజనకర్మకు అధికారములేదని చెప్పబడియున్నది Q. బ్రాహ్మణులనగా యెవరు? Answer యెవరిని లోకమంతా బ్రాహ్మణులని పిలుస్తు

---

1 మనుస్మృతి 10వ యధ్యాయము.

శ్లో॥ షణ్ణాంతుకర్మణామస్య త్రీణికర్మాణిజీవికాః
యాజనాధ్యాపనే చైవ విశుద్ధాచ్చప్రతిగ్రహః॥ 76
త్రయోధర్మానివర్తంతే బ్రాహ్మణాత్ క్షత్రియంప్రతి
అధ్యాపనం యాజనంచ తృతీయశ్చప్రతిగ్రహః॥ 77
జీవేదేతేనరాజన్య స్సర్వేణాప్యనయంగతః
నత్వేవజ్యాయసీంవృత్తి మభిమన్యేతకర్హిచిత్॥ 95
యోలోభాదధమోజాత్యా జీవే దుత్కృష్టకర్మభిః
తంరాజా నిర్ధనంకృత్వా క్షిప్రమేవప్రవాసయేత్॥ 96
వరంస్వధర్మోవిగుణో నపారక్యస్స్వనుష్ఠితః
పరధర్మేణజీవన్ హి సద్యఃపతతి జాతితః॥ 97

క॥ వేదాంతశాస్త్రబోధన। మేదురతుశముంగడించి మెలఁగినవాఁడీ
భూదేవాగ్రణి, వహావా। యేదేశముఁజనిన గౌరవింత్రు మనీషుల్ 10

---

న్నారో యెవరిని బ్రాహ్మణులుగా భావించినారో వారె బ్రాహ్మణులు. యజనము, యాజనము దానము ప్రతిగ్రహము అధ్యాపనము అధ్యయనము అను షట్కర్మలు యెవరికి అనుశ్రుతముగా పూర్వమునుంచి వచ్చుచున్నవో వారె బ్రాహ్మణులు. అధ్యాపనమనగా యితరులకు వేదము చెప్పుట. అధ్యయనమనగా తాను వేదము చదువుట. యజనము తాను యజ్ఞాదులను చేయుట. యాజనము యితరులచేత యజ్ఞాదికర్మలు చేయించుట. దానముఅనగా వకరికియిచ్చుట, ప్రతిగ్రహమనగా వకరివద్దపుచ్చుకొనడము. 75 శ్లోకము నకు క్రిందవ్రాశిన తెలుగు అర్థముసరిగానేవున్నది. యీ 75 శ్లోకమునకు చర్చవ్రాసియుండలేదు. యీఆరు కర్మలు. కర్మలలోనెవరైనా వకడుయేదైనా చేయకపోయినా వాడిపూర్వులలో యెవరైనా యీఆరుకర్మలు చేసినవారుండిరా అతనుఆసంతతివాడు గాన బ్రాహ్మణుడని పిలువబడుతాడు. మూడుతరములవారువరకు యీఆరు కర్మలలో యజ్ఞము చేయకపోతె బ్రాహ్మణునికి యజ్ఞాదికర్మలు చేయుటకు అధికారముండదు. అధికారమువచ్చుటకు ప్రాయశ్చిత్తము చేసుకోవలెను. బ్రాహ్మణుని సంతతివారైతె కర్మచేయకపోయినా బ్రాహ్మణుడని పిల్వబడుతాడు. 1 మనుస్మృతి1వ అధ్యాయములో 88వ శ్లోకములో బ్రాహ్మణునికొఅను 6 కర్మలు చెప్పబడివున్నవి. 2 పరాశరమాధవీయములో ఆచారకాండలో 31 వ పేజిలో యాజనమునకు అధికారము బ్రాహ్మణులకుమట్టుకు వున్నదని చెప్పబడివున్నది. Ex. C- 3 నిర్ణయశింధులో 192వ

---

1 మనుస్మృతి 1 వ అధ్యాయము.

శ్లో॥ అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనంతథా
దానం ప్రతిగ్రహశ్చైవ బ్రాహ్మణానామకల్పయత్ ॥ 88

2 పరాశరమాధవీయము ఆచారకాండము 31వ పేజి.

శ్లో॥ యాజనాధ్యాపనేశుద్ధే తథా శుద్ధప్రతిగ్రహః
ఏషా సమ్యక్సమాఖ్యాతా త్రితయం తస్యజీవికా

3 నిర్ణయసింధువు 192వ పేజి.

శ్లో॥ యస్మాద్దేణార్చితంలింగం విష్ణుంవాప్రణమేన్నరః
నతస్యనిష్కృతిర్దృష్టా ప్రాయశ్చిత్తశతైరపి

సీ॥ ఎంతటిప్రాజ్ఞుండై యితఁడుగానుండిన
సాక్ష్యముఁ విన మహాజనము రాదు

---

పేజిలో శూద్రుడుచేత ప్రతిష్టించబడిన విగ్రహామునకు పూజచేసిన అగ్రవర్ణములవారికి ప్రాయశ్చిత్తమునకు దోషముపోదు. విశ్వబ్రాహ్మణులనేజాతి ధర్మశాస్త్రములలో యెక్కడ చెప్పబడియుండలేదు. 10 జాతులబ్రాహ్మణ బేధములలోకూడా విశ్వబ్రాహ్మణజాతి చెప్పబడియుండలేదు. శాస్త్రములలో రథకారులకు యేర్పరచిన వృత్తులు యిప్పుడుమన దేశములో యెవరుచేస్తున్నారో వారిని కంసాలులుఅని అంటారు. శిల్పవృత్తులచేత జీవించువారు రథకారకులు. యిప్పుడు తెలుగుదేశములో కంసాలులు బత్తులు అనేవారు శిల్పవృత్తులతో జీవించుచున్నారు. యిప్పుడు కంసాలీలు అనేవారు రథకారకులకు నియమింపబడిన వృత్తులతో జీవిస్తున్నారు. గనుక యీకంసాలీలను రథకారకులని చెప్పుచున్నారు. 1 జైమినీయ న్యాయమాలావిస్తరముఅనే గ్రంథములో జైమిని మహారుషిచే 310 పేజిలో రథకారులనేవారు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు కాక వేరుజాతివారు అని వ్రాయబడివున్నది. 2 యాజ్ఞవల్క్యస్మృతిలో 15 పేజిలో రథకారకుడనగా మాహిష్యునికి కరణికిపుట్టినవాడని చెప్పబడియున్నది. మాహిష్యుడనగా వైశ్యస్త్రీయందు క్షత్రియునకు పుట్టినవాఁడు. కరణిఅనగా శూద్రస్త్రీకి వైశ్యపురుషునకు జనించినది. రథకారకులలో రెండుతరగతులువున్నట్టు 3 ఔశనసస్మృతిలో వున్నది. దానిలో 22 వ పేజిలో రథకారకుడనగా బ్రాహ్మణస్త్రీయందు దొంగతన

---

1 జైమినీయన్యాయమాలావిస్తరము 310వ పేజీ.

శ్లో॥ విప్రాదిరేవరథకృ దన్యోవాదోస్తుయోగతః
రూఢేర్వర్ణాంతరం తస్యాధానే వర్షర్తురుచ్యతే

2 యాజ్ఞవల్క్యస్మృతి 15వ పేజి.

క్షత్రియేణ వైశ్యాయాముత్పాదితో మాహిష్య-వైశ్యేన శూద్రాయాముత్పాదితా కరణీ-తస్యాం మాహిష్యేణోత్పాదితో రథకారోనామ జాత్యాభవతి.

3 ఔశనసస్మృతి 22 వ పేజి.

శ్లో॥ బ్రాహ్మణ్యాం క్షత్రియాచ్చౌర్యాద్రథకారః ప్రజాయతే
వృత్తంచ శూద్రవత్తస్య ద్విజత్వంప్రతిషిధ్యతే

ఎంతటిధీరుండో యితఁడుగాకుండిన
సతము దానిలిఖించి చదువుకొనరు

ముగా క్షత్రియునకు పుట్టినవాడు రథకారుడనిన్ని అతనివృత్తి శూద్రునితో సమానమైనవృత్తి అనిన్ని ద్విజత్వములేదని చెప్పబడివున్నది. సూచకునకు బ్రాహ్మణకన్యకయందు పుట్టినవాడికి తక్షకుడనిపేరు. వానివృత్తులు శిల్పాదులు యిది 1 ఔశనసస్మృతిలో 23 వ పేజిలో చెప్పబడివున్నది. సూచకుడనగా శూద్రస్త్రీకి వైశ్యుడువిధివతుగా వివాహముచేసుకోగా పుట్టినవాఁడు. స్కాంధపురాణ 2సూతసంహిత 50 పేజిలో బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియునికి పుట్టినవాఁడు సూతుడు. సూతునకు బ్రాహ్మణస్త్రీయందు దొంగతనముగా పుట్టినవాడు రథకారుడు అని చెప్పబడివున్నది. తక్షకుడని రథకారుడు లోహకారకుడని చర్మకారకుడని శిల్పి వర్ధకి అని వేరువిధములున్నట్టు చెప్పబడినవి.

... ... 15-8-11:—యాజనము చేయించుటకు బ్రాహ్మణులకే అధికారమువున్నదని విషయములో 3 విష్ణుస్మృతిలో కూడావున్నది. దానిలో 10 పేజిలో చెప్పబడివున్నది. 4 మార్కండేయ పురాణము 53 వ పేజిలో యాజనము అధ్యాపనము ప్రతిగ్రహము యీమూడు బ్రాహ్మణకర్మలని చెప్పబడియున్నది. శిల్పాదులు శూద్ర

1 ఔశనసస్మృతి 23 వ పేజి.

శ్లో॥ సూచకాద్విప్రకన్యాయాం జాతస్తక్షక ఉచ్యతే
శిల్పకర్మాణి చాన్యాని ప్రాసాదలక్షణంతథా

2 సూతసంహిత 50 వ పేజి.

శ్లో॥ కరణాయాంతువిప్రేంద్రా! మాహిష్యాద్యోవిజాయతే
సతక్షారథకారశ్చప్రోక్తశ్శిల్పీచవర్ధకీ
లోహకారఃకర్మకారఇతివేదార్థవేదిభిః.

3 విష్ణుస్మృతి 10 పేజీ

సూ॥...బ్రాహ్మణస్యయాజనప్రతిగ్రహౌ

4 మార్కండేయపురాణము 53 వ పేజీ

శ్లో॥యాజనాధ్యాపనేశుద్ధస్తథాపుత్ర!ప్రతిగ్రహః
ఏతత్సమ్యక్సమాఖ్యాతంత్రితయంతస్యజీవికా
వ్యాఖ్యాతంశూద్రధర్మోపిజీవికాకారుకర్మభిః

ఎంతటిచతురుండౌ యితఁడుగాకుండిన
వంచింపక వకీళ్లు వదలిపెట్ట

---

కర్మలని మార్కండేయ పురాణము 53 వ పేజిలోనె చెప్పబడివున్నది. 1 అమరనిఘంటులో 255 వ పేజిలో రథకారుడనగా యెట్టివాడో మాహిష్యుడనగా యెట్టివాడో కరణియెట్టిదో వ్రాశివున్నది. నేను పైనచెప్పినవిధముగానే వ్రాశివున్నది. Ex. K 2 నారదస్మృతిలో 62 వ పేజిలో యాజనము బ్రాహ్మణుని ధర్మమని చెప్పబడి వున్నది. Ex. K. దీనిలో ఆపద వచ్చినప్పుడు తనకంటె తక్కువ కులవృత్తి ఆచరించవచ్చునన్నాడు. 3 మనుస్మృతిలో 10వ అధ్యాయములో 590వ పేజిలో 100 వ శ్లోకములో శిల్పాది వృత్తులు శూద్రుడికి యితర వృత్తులవల్ల జీవనము దొరకనప్పుడె ఆచరింప వలసినదిగా వ్రాయబడి వున్నది. 4 స్మృతి ముక్తాఫలములో 52వ పేజీలో రథకారుడనగా యెవరో చెప్పబడి వున్నది. తక్ష, శిల్పి, వర్ధకి, లోహకార, కర్మకారులు రథకారులని చెప్పబడివున్నది ఆ పేజీలోనే రథకారులకు వాస్తుశాస్త్రముచదువడము దేవాలయములప్రాకారములు తయారుచేయు

---

1 అమరనిఘంటువు 255 వ పేజీ

శ్లో॥ రథకారస్తుమాహిష్యాత్కరణ్యాంయస్యసంభవః

2 నారదస్మృతి 62 వ పేజీ

శ్లో॥ వైశేషికంధనంజ్ఞేయంబ్రాహ్మణస్యశుభంత్రిధా
ప్రతిగ్రహేణయల్లబ్ధంయాజ్యతశ్శిష్యతస్తథా
విపర్యయాదధర్మస్స్యాన్నచేదాపద్గరీయసి
ఆపత్స్వనంతరావృత్తిర్బ్రాహ్మణస్యవిధీయతే

3 మనుస్మృతి 10 వ అధ్యాయము 39 వ పేజీ

శ్లో॥ అశక్నువంస్తుశుశ్రూషాంశూద్రః కర్తుంద్విజన్మనాం
పుత్రదారాత్యయం ప్రాప్తోజీవేత్కారుకకర్మభిః

4 స్మృతిముక్తాఫలము 52వ పేజీ.

శ్లో॥ మాహిష్యాత్కరణాయాంతు రథకారఃప్రజాయతే
అథపర్యాయనామాని తక్షాశిల్పీచవర్ధకీ
లోహకారఃకర్మకారో ...

రెంతటివేత్తయే యితఁడుగారుండిన
మున్నిభు గూఢార్థములనునడుగఁ

---

డము నగలు వగైరాలుచేయడము నాగలి వగైరాపనులుచేయడము యజ్ఞపాత్రలు చేయడము వారివృత్తులుగా చెప్పబడివున్నది. 1వాచస్పత్యములో4791 పేజీలో రథకారుడనగా మాహిష్యవనుకరణికి పుట్టినవాడని చెప్పబడివున్నది.Ex.M.విశ్వబ్రాహ్మణుల నేపదము అమరములోలేకపోవుటేకాక వాచస్పత్యములోకూడా లేదు. అమరమువిఘంటువుగా ప్రతిచరిత్రకారులు వప్పుకున్నారు. 4 వేదములలో నేనుచూచినంతవరకో గాని పురాణములలోగాని స్మృతిశృతులలోగాని విశ్వబ్రాహ్మణులని పదములేదు. నేను తర్కశాస్త్రము వేదాంతశాస్త్రము అలంకారశాస్త్రము చదివినాను. యజ్ఞము చేసినాను

Cross Examination—రథకారులకు యజ్ఞముఅధికారమున్నట్టు Ex. D.లో 307 పేజీలో చెప్పబడివున్నది.యాజనములోవారు ఆధానమనేకర్మచేయుటకు మాత్రమె అధికారమున్నదిగాని తక్కినకర్మలుచేయుటకు వీలులేదు అని చెప్పబడివున్నది. రథకారుడు ఆధానకర్మ చేయవచ్చునని వేదములలో చెప్పబడివున్నది. ఆధానకర్మ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు చేసేటప్పుడు వకమంత్రముతోను రథకారులు చేసేటప్పుడు వకమంత్రముతోను చేయవలసినదిగా చెప్పబడి వున్నది. యాజనమనగా యజ్ఞముచేయించుట అని సరిఅయిన అర్థము. యాజనమనగా యితరులచేత కర్మాదులు చేయించుట. దేవాలయప్రతిష్టలువగైరాలు యాజనములక్రిందికి వస్తుందని నాఅభిప్రాయము. దేవాలయప్రతిష్టలు యాజనములోకి వస్తుందని పురుషత్తుయిస్తేచూపించగలను. యాజనమనగా దేవాదులకు హావిస్సు యిచ్చుటకుగాను చేయించే కర్మ. హావిస్సు యిప్పించె అధికారములేనప్పుడు అట్టివారు చేయించిన కర్మ

---

వాస్తుశాస్త్రమధీయానః ప్రాసాదప్రతిమాదికం
యజ్ఞపాత్రం ద్విజాతీనాం హైమాన్యాభరణానిచ
కృష్యుపస్కరణంలేఖ్యం కర్మాణ్యస్యోదితానిచ

1వాచస్పత్యము 4791 వ పేజి.

రథకారః-పుం-రథంకరోతి-వర్ణసంకరభేదే
కరణ్యాం మాహిష్యాజ్జాతే

# శంతనురాజచరిత్ర

## తృతీయాశ్వాసము.

క॥ శ్రీమత్కౌస్తుభరత్నోద్ధామ! ధగద్ధగితభాస్వితశ్రీవత్సాం
కామలరుచిసమ్మిళిత! కోమలదరహాస! శేషకుధరనివాసా! ॥ 1

వ॥ అవధరింపుము జనమేజయునకు వైశంపాయనుం డనుకం
పాన్వితచిత్తుండై యిట్లనియె. 2

~ మణికంధరుని కొమార్తె వనవిహారము వచ్చుట ~

ఉ॥ అచ్చపలేక్షణాతిలక మంత వసంతము వింతమీఱి రా
నచ్చరతీఁగెబోండ్లఁ బరిహాసమొనర్చు విలాసినీమణుల్
చెచ్చెర నిచ్చ ముచ్చటలు చెప్పుచుఁ దోఁజనుదేరఁ బచ్చరా
గుచ్చులహెచ్చుడాలు వగఁగుల్కెడి పల్లకియెక్కి వేడ్కచేఁ॥ 3

వ॥ శృంగారోద్యాన కేళీవిహార సంయూథభావమై చనిచని
ముందర. 4

క॥ వనజాక్షీతిలకంబటఁ
గనుఁగొనె మాకందకుంద ఖర్జూరలస
త్పనసాశోకశమీవట
ఘనతరతరునికరచిత్రతరమగుదానిన్॥ 5

వ॥ ఒక్కయుద్యానాభిరామంబగు నారామంబు ప్రవేశించి
కించిన్మధ్య యచ్చట యానంబుడిగ్గి యొక్కచెలియ కైదండగొని
యచ్చటచ్చట వర్తింపుచు. 6

* వసంతఋతువర్ణన *

క॥ "శుకవాణి! చూడుమివ్వని
శుకగేయస్ఫూర్తిఁ జక్రసుందరనియతిం

ప్రకటతరహంసనివహా
త్సుకవైఖరి నీలవర్ణసొబగున నలరెఁ॥ 7

వ॥ అదియునుంగాక. 8

సీ॥ తావిగుప్పుచునొప్పు మావిగుత్తులచొప్పు
వలిగబ్బిగుబ్బల చెలువుగాఁగఁ
గల్కిచిల్కల సొరుగుల్కుపల్కులతీరు
పొలుపుమాపెడి ముద్దుపలుకుగాఁగ
మదికినింపులునింపు కొదమయంచలగుంపు
డంబైన మందయానంబుగాఁగ
నెలమినీలపుడాలుగలుగు తుమ్మెదజాలు
కప్పుగుప్పెడు గొప్ప కొప్పుగాఁగ
సొగసులుపచ్చిపగడంపుఁ దొగరుచిగురు
లవిలసిల్లు చెంగావిమోవిగాఁగఁ
గలిగియవ్వని యవ్వనకన్యవోలెఁ
గానవయ్యెను గనుగొంట కమలవదన!॥ 9

క॥ సురసాలముగాంచితె చెలి!
సురసాలముగతి నభీష్టశుభఫలదము భా
సురసాలము గనుగొంటివె
సురసాలముకొమ్మలంటి శోభిలెఁగొమ్మల్॥ 10

సీ॥ మన్మథనామసమారూఢినో సుమ
నోబాణసంభృతి నుతులుగాంచెఁ
బురుషాభిధానతఁ బొలుపుమీఱుటనేమొ
శ్యామానుగతమున సంచరించె
నర్జుననామధేయప్రశస్తినొ కౌశి
కగురువిస్ఫూర్తిచే ఘనతగాంచెఁ

గాంచననగసమాఖ్యనుమీాఱుటను బహు
పాదసంగతిగల్గి పరిఢవిల్లె
నురుతరోద్యచ్ఛివాహ్వాయాభ్యుదయమునను
నాగధరభూరివైభవప్రోన్నతులుగాంచె"
ననుచుఁ గరమునఁ గరము గీల్కొనఁగఁ జేసి
చెలియ కేలెఁగించెఁ జిలుకలకొలికియపుడు॥ 11

వ॥ ఇత్తెఱంగున నమ్మోహనాంగి కురంగమదగంధబంధురప్రహార్షార్ణవంబు వెల్లిగొన నయ్యారామాభిరామమహీరుహవిశేషంబులు ముద్దుచెలియ కేలెంగింపుచుఁ బంకజాక్షు లిరువంకలఁ గొంకులేక సేవింప నచ్చటచ్చటవర్తింపుచు వనలక్ష్మి తమరాకల కలరి యడుగులకు మడుగులుపఱచినకైవడిఁ బుడమి నెడలేక నిండిన గొప్ప కప్పురంపుఁదిప్పలపై నుప్పరవీధిగప్పుకొని యొప్పులుగలతావులు గుప్పుచు విప్పగల పూవుచప్పరంబుల యిమ్ములఁ గొమ్మల త్రోరమ్ములగుకుచమ్ములఁ బొందుపఱచుచుఁ దఱచు ఫలమ్ముల విఱ్ఱవీఁగు కొమ్మలుగల నిమ్మలు గనుంగొని సంతసిల్లుచుఁ గొదమతుమ్మెదకదుపులరొదలఁ బొదలు పొదలమొదల వదలక యల్లిబిల్లిగ నల్లికొన్న మొల్లంపు టల్లికల కుల్లసిల్లుచుఁ బాలకడలిపట్టి త్రోఁబుట్టుచట్టుల గట్టిగఁగట్టిన మెట్టుల నిట్టట్టు గొట్టుపడక నెట్టన గట్టుననుండి బోరునం బాఱు పూవుఁదేనియవాఁకలు చొచ్చి విచ్చలవిడి విడివడిన పచ్చవిల్తుని మదపుటేనుంగుగుంపులపెంపున నీదులాడు బోదరాయంచలంగాంచి వంచించి పట్టందలంచుచు విహరించుచున్న సమయంబున, 12

శతకవచుఁడు వనమునకువచ్చుట.

క॥ రతిపతిసంహారదత్తో, న్నతచారుశతాంగమెక్కి నానాదిశలన్
జతురతఁ‌శోధింపుచు, శతకవచుండేగుదెంచెఁ జయ్యనఁనటకున్॥

తే॥ ఏగుదెంచితదారాను మెల్లచోట్లు
గాంచి ఘనరోహిణీకాంతకాంతరత్న
సంకలితభూరివేది విటంకములను
నిలిచినిలిచివిహారంబు సలిపినలిపి॥ 14

వ॥ అంత నొక్కయెడఁ దారకామధ్యగతయైన చంద్రరేకవిధంబున సఖీనికరాంతస్థితయైన యమ్మోహనాంగి మనోహరాంగినిం గనుంగొని వినిశితశంబరాంతకనిర్ఘాతసంఘాతరోపమానవిభ్రాజమానప్రసూనశిలీముఖబాధ్యమానమానసుండై నితాంతచింతాకూపారాంతర్నిమగ్నాంతరంగుండగుచుఁ దనలోనిట్లనియె॥ 15

క॥ "ఈలోలేక్షణ మరునిల్లాలో లేకెన్నిచూడ నచ్చరలేప్రో
యాలోకా దీనికిసరి భూలోకమునందుఁబోల్పఁ బోలఁతులుగలరే॥

సీ॥ చక్రపరీహాససౌందర్యమునమీఱఁ
గలికికుచంబులు కటితటంబు
కమలవిదూషణక్రమమున నొప్పారెఁ
గనకాంగి నెమ్మోము కన్నుగవయు
కాంచనవ్రీడాకృదంచితస్థితిమీఱె
నలినాస్యమైజిగి నాశికంబు
పున్నాగసాధ్వసస్ఫూర్తితోఁ గనుపట్టె
నంగనయానంబు నారుతీరు
భాసురతరప్రవాళవిభ్రాజమాన
గతినలరెఁ గొమ్మకరములు కావిమోవి
యౌర! యీతన్విఁగనుగొన్న నతనుఁడైన
మోహవారాశిలోపల మునుఁగకున్నె॥ 17

సీ॥ తమ్ములమీఁదటఁబనరారుచున్నట్టి
కమలగర్భంబులఁ గమలగర్భ

ములమీఁద ననఁటుల లలి ననంటులమీఁద
మేదిని మేదినిమీఁదఁ బొన్న
విరి పొన్నవిరిమీఁదఁ దరఁగలుతరఁగల
మీఁదను జాళువా మేనిగిండ్లు
వానిపై వలమురి వలమురిమీఁదను
విండ్లు నావిండ్లపై విధుని విధుని
పై మొగులు తగులొ్కనఁజేసి పద్మభవుఁడు
పొసఁగఁ గ్రొమ్మించుమించుగఁబోదలి తనదు
శిల్పవైఖరి దెలియంగఁ జేసినట్టి
ప్రతిమగాఁబోలు సిద్ధమీ పద్మనయన॥ 18

సీ॥ అబ్జాక్షికటిచక్ర మాక్రమింపఁగఁగల్గ
నవనిమండల మేలికల్లుగాదె
కుసుమకోమలి కుల్కుగుబ్బలు చేపొఁక
నల్ల మేరువునందినట్లుకాదె
అంగనమోవి నొక్కంగఁగల్గినను ది
వ్యాహారమబ్బినయట్లుగాదె
పూఁబోఁడినెమ్మేను పొదలిపట్టగఁగల్గఁ
నమితకాంచన మబ్బినట్లగాదె
కాన యీముద్దుగుమ్మ యీకలికిచిలుక
యీజగన్మోహనాకార యీకుమారి
యీమనోహరసౌందర్య యీలతాంగి
నన్నుఁగృపఁజూడ భాగ్యంబునాదికాదె"॥ 19

వ॥ అని యక్కుసుమకోమలి సౌందర్య సౌకుమార్య చాతుర్య విశేషంబు లశేషంబుగా వేఱువేఱవర్ణింపుచుఁ దత్సమీపమ్మునకే తెంచునవసరంబున॥ 20

కం॥ కనుఁగొనియె మోహనాంగుని
వనజేక్షణభూరిరూప వైభవజితత
ద్వనజాంబకు వనజాంబక
హానకృపాలబ్ధతేజు నల శతకవచున్॥ 21

వ॥ అయ్యెడ 22

క॥ అయ్యారె! చెలువన త్తతిఁ। దియ్యనివిలుఁబూని విరులతెగలశరాళిన్
గయ్యాళిపచ్చతేజీ।యొయ్యారివజీరు తగ మహోద్ధతి నేసెన్॥ 23

తే॥ కంటికిదిసింపనట్టివాఁడంట కందుఁ
డమ్ములనె కొమ్మనెమ్మది హాళిఁ జూచి
యమరఁజెందించె,ధర మెత్తనైనచోట
వరుసఁగలపోయ గుద్దలివాఁడిగాదె॥ 24

వ॥ అంతనచ్చోటఁ దనతోటి మేటిబోటికి వసుంధరాభృచ్ఛత
కోటిధరుంజూపి యిట్లనియె. 25

ఉ॥ "గెంటనిచాయకుందనము గేలియొనర్చెడిమేను నోటలే
యింటిలో నొక్కటీఁగలదేయని తమ్ములనవ్వనెమ్మొగం
బంటినకందుహస్తములు నమ్మకచెల్ల! మఱెన్నియైన వా
ల్గంటులు వీసిఁజూచినను గంటికి నిద్దురవచ్చునే చెలీ!॥ 26

క॥ కాంతా!యలవియె యీభూ,కాంతునితోనిష్టగోష్ఠి గడపుచుఁదా నే
కాంతమున నుండఁగలిగిన। కాంతామణిజన్మఫలము గణుతింపంగన్॥

తే॥ కండచక్కెర పూఁచేనె కలయఁగలపి
యజుఁడుచేసిన పీనధారామృతంబు
గుటుగుగుటుకగుటుక్కునఁ గ్రోలఁగలుగు
దాసదేమిమి భాగ్యంబు తరళనయన!॥ 28

తోటకము॥ కంతుజయంతులఁ గాంతుము,తారా
కాంతు వసంతుని గందుము ని భూ

కాంతునితో సరిగానను పోల్పఁగ
వింతగు నెంతయు నీరదవేణి! 29

క॥ తొలిజన్మంబుల నేతపములుచేసెనొనిష్ఠ మణులు ముఖ్యాకల్ప
స్థలసంఘటితములగుచుఁ। జెలియా!యీనృపునిదేహసీమఁ నిలువఁ॥

క॥ కొమ్మా!యీకన్నుల యా।నమ్మా యీనృపునిజూచినదియాదిగ నా
నెమ్మనమునఁ బరితాపము। నిమ్మ కెరువువేసినటుల నెఱసెఁగదమ్మా!

క॥ మకరాంకుబాణపంచక। మకటా!నిర్ఘాతజాత మటుగాకున్నఁ
సెకచల్లుచు మద్ధైర్యము।సకియ! వకావకలుచేయఁజాలు నెతలఁపఁ॥

ఆ॥ మోహనాంగి!పొసఁగ ముల్లునాటినచోఁట
గొట్టుగొట్టినట్లు కుమతియగుచు
నన్ను నేఁచఁజొచ్చెఁ బన్నుగావలిగాలి
తొలుత వీనిచర్య ధూళిగాను॥ 33

క॥ జాలిం బెట్టఁగఁజొచ్చె।నుజాలగనీశుకపికాళిజలజాస్త్రుబలో
ద్వేలాట్టహాసనన్నిభ।కోలాహలనాదమిపుడుకోకిలవాణీ॥ 34

క॥ అరియరియై శిఖిశిఖియై।హరిహరియై యాశుగము మహాశుగమై శం
బరభంజనుండు తగ శంబరభంజనుడై యొసంగె బరిభవము చెలీ!॥

వ॥ అనిపలికి మఱియునిట్లనియె. 36

తే॥ "అమ్మనేచెల్ల!భూరిమోహప్రతాప
మంతకంతకు నగ్గలంబై చెలంగె
ఏమిచేయుదునింకనో యిగురుబోణి!
ఎట్లుగానున్న దోకదా యీశ్వరాజ్ఞ॥ 37

వ॥ ఇందిందిరబృందసుందరాలకా! యీసుందరీకందర్పపూర్ణి
మాసుధాధామబింబంబునకు క్షీరపారావారంబునుంబోలిన యన్వవా
యంబును,జందనగంధీ!హరిచందనంబునకుసంక్రందనునందనంబునుంబో

లిన యీాతనిజనకు నామంబును, గుందరదనా! కుందంబునకు సౌరభంబు నుంబోలిన పీని విమలాభిధానంబును, వేఱువేఱ నెఱుంగవలయు" ననిప లుకుచున్న సమయంబున నన్నరవరకుమారకుమారకుమారుం డక్కుమారి సమీాపంబున కేతెంచి మృదుమధురవచనరచనాచాతుర్యధుర్యుండగు చుఁ గంతుని మదదంతిభింతందనరు నయ్యింతికిట్లనియె, 38

సుగంధి ॥ చంద్రసన్నిభాస్య! యేను జంద్రవంశజాతుఁడన్
జంద్రశేఖరావనీశచంద్రు కూర్మిసూనుఁడన్
జంద్రశేఖరోల్లసత్ప్రసాదలబ్ధతేజుఁడన్
జంద్రికాబ్జహారహీరచారు కీర్తి నెంతుఁ జన్ ॥ 39

తే॥ శతకవచుఁడంద్రుఁ నాపేరు జగతియందు
చల్లకనివచ్చి యుంత దాచంగనేల
యేనువచ్చినకార్యంబు నెఱిఁగికొనుము
నిజము చెప్పెద నుత్పుల్లనీరజాక్షి॥ 40

శా॥ నీలావణ్యము నీకళావిభవముఁ నీవిభ్రమాకారముఁ
నీలాలిత్యమనోజ్ఞయౌవనము హా! నేఁగన్నమాత్రాన నే
బాలా! పుష్పధనుర్విముక్తవిలసద్బాణావళిన్ మద్ధృదు
ద్వేలాప్రాభవమెల్లమాఁర్చిమరుఁ డుద్రేకప్రతాపోగ్రుఁడై॥ 41

కం॥ వనజానన! నీచూపుఁలు ననుసోకినయంత మదనునారాచంబుల్
తనువుననంటెనుగొమ్మలు|కనుసన్నలమెలఁగుఁగాదె కాముని శరముల్॥

తే॥ ఎంతఘాతకుఁడకట! లతాంతకుంతుఁ
డతనిశరములు సూనంబులనుట దగదు
కనుగొనఁగ ధాతచేసిన కమ్మపూల
పేరిట నెసంగు బలువైన పిడుగులగును॥

12 వెలుగూరి పిచ్చయ్యగారు, కొదమగుండ్ల.
13 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.
14 గొల్లపూడి వేంకటసుబ్బారావుగారు, వాల్టేరు బ్రదర్సు, కంపెనీ.
15 దెందుకూరి బ్రహ్మందీక్షితులుగారు, గుంటూరు.
16 శేషమళ్ల గోపాలరావుగారు, కరణం, అమిదీపురం.

## ఈనెల సొమ్ము చెల్లించిన చందాదారులు.

1 ఇరుకుళ్ల వెంకయ్యగారు, సిరిసిల్ల.
2 అకిళ్ల శేషశాస్త్రిగారు, సంకలమంట
3 చల్లా సుబ్రహ్మణ్యముగారు కారెంపూడి.
4 తురిమెళ్ల హనుమంతరావుగారు స్పెషల్ రివిన్యూ యినస్పెక్టరు, తెనాలి.
5 మంచికంటి వెంకటరామయ్యగారు, కంట్రాక్టరు, నరసరావుపేట.
6 గుండేపూడి వెంకటప్పయ్య, నరసింహం గార్లు, సత్తెనపల్లి.
7 సంకలమంట కోటయ్యగారు, నరసరావుపేట.
8 వెల్లాల సదాశివశాస్త్రిగారు, కొల్లాపురము.
9 శంకరమంచి అన్నయ్యశాస్త్రిగారు, చినఓగిరాల.
10 తూములూరు సదాశివయ్యగారు కరణం, చినలూరు
11 సిద్ధిభట్ల వెంకనాగేశ్వరరావుగారు తహశీల్దారు, గురిజాల.
12 భీమరాజా లక్ష్మినారాయణరావుగారు ప్లీడరు, వంగవోలు.
13 ప్రభల వీరరాఘవయ్యగారు ప్లీడరు, తెనాలి.
14 తూములూరు కోటయ్యగారు, పినపాడు.
15 కామరాజుగడ్డ రాఘవయ్యగారు, చుండూరు.
16 వెడవెల్లి కామేశ్వరరావుగారు ప్లీడరు, బాపట్ల.
17 తంగిరాల ఆంజనేయులుగారు ప్లీడరు, బాపట్ల.
18 సూరి వెంకటేశ్వరులుగారు ప్లీడరు బాపట్ల
19 పూటుకూరు కోటయ్యగారు, చీరేల
20 పూటుకూరు వెంకటేశ్వరులుగారు చేర్మను, చీరేల.
21 అప్పాజోశ్యుల కృష్ణశాస్త్రిగారు, చీరేల
22 సంకలమంట సంగయ్యగారు, నరసరావుపేట.
23 గిద్దలూరు చంద్రశేఖరుడుగారు, నరసరావుపేట.
24 జయంతి రామయ్యపంతులుగారు అసిస్టాంటు కలెక్టరు, గుంటూరు.
25 చివుకుల వెంకటాచలశాస్త్రిగారు, సికింద్రాబాదు.
26 నేలనూతుల వెంకటసుబ్బయ్యగారు, ఈమని.
27 వేదాంతం వెంకటేశ్వరులుగారు.
1 మల్లాది కామయ్యగారు చింతపల్లి దొరసానిగారి సంస్థానం, గుంటూరు.
సయ్యదు ఖాసీమ్‌సాహేబుగారు, ఫారెస్టుగార్డు చింతపల్లి.

అభినవసరస్వతీ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు—

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అళియాచార్యవిజయము ... ... | రు. 0 | 4 | 0 |
| 2 | కరిణీకోద్ధారిణి ... ... | 0 | 4 | 0 |
| 3 | వాసంతికాపరిణయము } ఇవి నాటకములు. | 0 | 4 | 0 |
| 4 | కంసవధము } | 0 | 8 | 0 |
| 5 | చమత్కారమంజరి ... ... | 0 | 4 | 0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర .. ... | 0 | 2 | 0 |
| 7 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | 0 | 2 | 0 |
| 8 | వత్సల నీతిశతకము . ... | 0 | 1 | 0 |
| 9 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము ... ... | 0 | 2 | 0 |
| 10 | అత్యద్భుతవిమర్శనము . . ... | 0 | 5 | 0 |
| 11 | నర్సరావుపేట శతావధానము (తిరుపతి వేంకటీయము) | 0 | 3 | 0 |
| 12 | లక్ష్మీవిలాసము ... ... | 0 | 4 | 0 |
| 13 | చిత్తూరుజిల్లా తీర్పువిమర్శనము ... | 0 | 4 | 0 |
| 14 | పశ్యాంపుశ్యాం ... . . | 0 | 2 | 0 |
| 15 | సంగదోషము ... . | 0 | 3 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము .. ... | 0 | 3 | 0 |
| 17 | వీరభాగవతము ... .. | 1 | 4 | 0 |
| 18 | పుళిందావివాహము ... ... | 0 | 4 | 0 |
| 19 | గురిగింజ .. ... | 0 | 1 | 0 |
| 20 | గుంటూరుసీమ, తిరుపతివేంకటీయము ... | 1 | 0 | 0 |
| 21 | వేమవరాగ్రహారశతావధానము ... | 0 | 12 | 0 |
| 22 | పిష్టపేషణము ... ... | 0 | 1 | 0 |
| 23 | వ్యాసనిష్కాసనము ... ... | 0 | 1 | 0 |